# దంతవేదాంతం
# అంతా ఇంతే

★

రచయిత
భవిండిపాటి రాధాక్రిష్ణ

★

ప్రచురణ
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్స్
సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి



మొదటి ముద్రణ : జనవరి, 1960
ద్వితీయ ముద్రణ : నవంబరు, 1965.
తృతీయ ముద్రణ : జనవరి 1976.



Paper used for the Printing of thise books
Were made availbly by the Government of Inc
at Conscissional rate



వెల : [redacted] [illegible]

ముద్రణ :
భాస్కర్ ఆర్ట్ ప్రింటర్స్,
రాజమండ్రి—1.

## గమనిక

ఈ నాటికలో ఏదైనా, ఎందుకోసమైనాసరే

ప్రదర్శింప దలచినవారు

ముందుగానే అందుకు రచయిత

లిఖితానుమతి పొందడం మర్యాద.

అన్నట్టు, అటువంటి లిఖితానుమతి

పొందకుండా ప్రదర్శించడం

కాపీరైటు చట్టప్రకారం నేరంకూడాను!

భమిడిపాటి రాధాకృష్ణ,

రాజమండ్రి.

# దంత వేదాంతం

## పాత్రల పరిచయం

జగన్నాథం : అనవసరమైనంత ఆర్జించిన ప్లీడరు, సుందరం తండ్రి

శాంతమ్మ : జగన్నాథం భార్య. సుందరం తల్లి. అల్పసంతోషి.

సుందరం : కమల ప్రేమే ప్రస్తుతానికి జీవిత లక్ష్యంగా కలవాడు.

రంగయ్య : ఆ ఇంట్లో నౌకరు,

విక్రమరావు : సర్కిలు ఇనస్పెక్టరు, కమల తండ్రి; అతి ధైర్యశాలి.

జ్ఞానశ్రీ : విక్రమరావు మామగారు, గొప్ప జ్ఞాని, మంచి వేదాంతి

డాక్టరు : ఆ ఊళ్ళో డాక్టరు, రోగాలకి సింహస్వప్నం అని పేరొందినవాడు.

# కృతజ్ఞత

1959 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం ఆధ్వర్యాన హైదరాబాదులో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తు మహాసభలలో ఉత్తమ ప్రదర్శనానికీ, ఉత్తమ రచనకూ, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ వారి ప్రథమ బహుమతులనూ,

ఆంధ్రమహాసభ నాటకపరిషత్తు, మద్రాసు — మే, 1959
లలితకళానికేతన్, రాజమండ్రి — అక్టోబరు, 1959
పి. అండ్ టి. కల్చరల్ — నవంబరు, 1959
నాటక కళాపరిషత్తు, [illegible]కోడేరు — డిసెంబరు, 1959

మొదలైన ఇతర అఖిలాంధ్ర నాటకోత్సవాలలో ప్రథదర్శనకీ, వివిధ బహుమతులనూ,

ఆలిండియా రేడియో, విజయవాడ-ఏప్రియల్, 1959 నాటక వారోత్సవాల సందర్భంలో రంగస్థల శ్రవ్యనాటికగా ప్రముఖుల ప్రశంసలనూ,

అందుకోగలిగిన ఉత్తమ స్థాయిలో ప్రదర్శనలిచ్చిన
శ్రీ నవ్యకళామండలి, విజయవాడ.

పి. అండ్ టి. కల్చరల్ ఎసోసియేషన్, రాజమండ్రి.
రాజ్ డ్రమటిక్ ఎసోసియేషన్, విజయవాడ

వారికి

నా హృదయపూర్వకమైన

అభివందనాలు.

['దంత వేదాంతం' నాటిక శ్రీ నవ్యకళామండలి (విజయవాడ) సభ్యులచేత S. R. R. అండ్ C. V. R. కాలేజీ, విజయవాడ, పాత విద్యార్థుల వార్షికోత్సవ సందర్భంలో 18-1-1959వ తేదీని మొదటిసారి ప్రదర్శింపబడినది.]

| పాత్రలు | పాత్రధారులు |
|---|---|
| జగన్నాథం | శ్రీ M. V. చలపతిరావు |
| సుందరం | శ్రీ S. V. సీతారామయ్య |
| రంగయ్య | శ్రీ G. రాధాకృష్ణమూర్తి |
| జ్ఞానశ్రీ | శ్రీ M.B.K.V. ప్రసాదరావు |
| విక్రమరావు | శ్రీ D. జగన్నాధరావు |
| డాక్టరు | శ్రీ P. వెంకటేశ్వరరావు |
| శాంతమ్మ | కుమారి V. లక్ష్మి |

ఈ సభ్యులే ఆంధ్ర ప్రదేశ్ నాట్యసంఘం ఆధ్వర్యాన జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తు మహాసభలలో, దంత వేదాంతం ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ రచనకే కాక,

శాంత పాత్రధారిణి కుమారి V. లక్ష్మి ఉత్తమనటి బహుమతిని

జగన్నాథం పాత్రధారి శ్రీ M. V. చలపతిరావు |
జ్ఞానశ్రీ పాత్రధారి శ్రీ M. B. K. V. ప్రసాదరావు | ప్రత్యేక బహుమతులను అందుకున్నారు.

# దంత వేదాంతం

[తెర తప్పుకోగానే ధనవంతుడైన గృహస్థు ఇంట్లో, శమ కుటుంబం కలుసుకునే ఉమ్మడిహాలు కనిపిస్తుంది హాలుమధ్యగా సోఫాసెట్టు దగ్గరలో టేబిల్ ఫాను. R M దగ్గ ఒక ఫోను ఉంటాయి. R.F లో ఒకటి L. F. లో ఒకటి M. B. లో ఒకటి మొత్తం మూడు మార్గాలు హాల్లోంచి లోపలికి ఉంటాయి. L B ప్రాంతముల్లో ఒక చిన్న డ్రాయరు, దానిమీద రేడియో, ఆపైన అలారం గడియారం ఉంటాయి, గడియారంతో టైము 4-45 గం॥లు అవుతుంది. L. F లోంచి ముందు జగన్నాథం, వెనకాల ప్లీడరుగారూ, కాగితాలకట్టా, పుచ్చుకుని రంగయ్యా వస్తారు. కాగితాలకట్ట రేడియో ప్రక్కమీద పెడతాడు]

జగ : (సోఫాముందుకి నడుస్తూ, కాలర్ బేండ్సూ, కోటూ తీసేస్తూ) రంగయ్యా!- అబ్బాయి వచ్చాడా ?

రంగ : ఇంకా లేదండి.

జగ : ఊ ! (తనలోలాగ, తలపంకిస్తూ) వస్తాడొస్తాడు !- (·ని కోటు, కాలర్ బేండ్సు రంగయ్య కిచ్చేసి) ఆ కాగితాలు తీసుకెళ్ళి ఆఫీసులో బల్లమీదకుడేయి! (అని సోఫాలో కూచుని, టీపాయిమీద ఉన్న పేపరు తీస్తాడు.)

రంగ : (వినయంగా, చిరునవ్వుతో) అయ్యగారు !-

జగ : ఏమిట్రా !

రంగ : (జగన్నాథం తలకేసి చూపెడూ) తలపాగాఅండి !

జగ : ఆ !- ఓహో. ఇదా !- దీసుకెళ్లు ! (ఇచ్చేసి) అన్నట్లు, ఒరేయి !- కాదు, పెద్దులోపడేసి డ్రైవరు

చక్కాపోతాడేమో !- పనుంది. ఉండమన్నానని
చెప్పు ఆ ?-

రంగ : సిత్తం !- తమకోసం ఎంకయ్యాగా రొచ్చి ఆఫీసులో కూకున్నారండి.

జగ : వెంకయ్యాలేడు, డొంకయ్యాలేడు !- నాకు బోల్డు పనుంది. రేపుపొద్దున్న రమ్మను !-

రంగ : సిత్తం !- ఖూనీసేసిన సుక్కయ్య నేడండీ - ఆడి బాబండి, ఈ ఎంకయ్య !

జగ : (తగ్గి) అల్లానా !- అయితే, ఒరేయి !- (మంచిగా మెల్లగా) గుమాస్తాగారు ఇంటి కెళ్ళిపోయారూ, ప్లీడరుగారికి పాపం ఒంట్లో బాగాలేదూ, ఊ !- పొద్దున్నే దయచెయ్యమన్నారూ, అని జాగ్రత్తగా చెప్పి పంపించెయ్యి.

రంగ : సిత్తం ! (లాయరుగౌను, కోటూ, కాలర్ బేండ్సూ తలపాగా పుచ్చుకుని M B లోకి వెడతాడు)

[R. F. లోంచి శాంతమ్మ యాలాభంగా వస్తుంది]

శాంత : (జగన్నాథాన్ని చూసి) వచ్చారా ? (అని వెంటనే [R. F కేసి తిరుగుతుంది. రంగయ్య M B లోంచి వచ్చి రేడియోబల్ల కేసి వస్తూంటాడు )

జగ : (చిరుకోపంతో, శాంతని ఉద్దేశించి) ఆగు అక్కడ ! (ఇద్దరూ ఆగిపోతారు. రంగయ్యతో) నువ్వు కాదు

నువ్వు ఫోతా !- (రంగయ్య కాగితాలు తీసుకుని L. F. లోకి వెడతాడు.)

శాంత: ఎందుకూ !

జగ : ఎందు కేమిటి ! అల్లా తొంగి చూసి చక్కా పోతున్నా వెక్కడికి ?

శాంత: బాగానేఉంది వరస ! (వెనక్కి తిరుగుతూ) కాఫీ తెస్తా నుండండి ?

జగ : (లేస్తూ ! కాఫీవద్దు, కషాయంవద్దు. నువ్వు ముందిల్లారా!-రా! అల్లా కూచో !

శాంత: (విభ్రాంతంగా) ఇదేం మనిషమ్మా ఎక్కడోనూ ! (కూచుని. మొగుడుకోపం చూసి) అల్లా ఉన్నారే ! కేసేమన్నా పోయిందేమిటీ ?

జగ : నీమొహం ! కేసుగాదు. కీర్తి ప్రతిష్టలు గంగాపాలయ్యాయి.

శాంత: అయ్యో. అదేమిటీ !

జగ : అదా ? చేసుకున్న ఖర్మ ! ఇరవై ఏళ్ళక్రితం చెప్పాను కొడుకుట్టాడు, కొడుకుట్టాడని మరీ సంబరపడకే, ముందుంది ముసళ్ళ పండగ అని.

శాంత: మన సుందరమా ? ఏంచేశాడు ?

జగ : ఏంజేస్తాడు ? నా వంశమర్యాద,లేమా అవట్టికెళ్ళి మరలో పోయించి పింఛాడిస్తున్నాడు !

శాంత: ఖర్మ ! (భయంగా) ఏమిటో తిన్నగా చెప్పండి !

జగ : అసలు దీనికంతకీ కారకురాలవు నువ్వు. నీ అసరా చూసుకునేగా వాడింత అఘాయిత్యం చేశాడు!

శాంత: (కంగారుగా) అఘాయిత్యమేంచేశాడండి! ఉస్! నాకు దడొస్తోంది!

జగ : వస్తోంది? ఇ కేముంది? కేసు డిస్ మిస్!

శాంత (రోషంతో) అంతేగాని సంగతేమిటో చెప్పరు!

జగ : అయితే విను! నీకొడుకు పీకలోతు ప్రేమవ్యవహారంలో దిగాడు.

శాంత ఏమిటీ? ఆశ్చర్యంగా) నిజమే?

జగ : (కోపంగా నవ్వుతూ) అజ్జే, శుద్ధ అబద్ధం! (జేబులోంచి తీసి) చదువుకో ఈ ఉత్తరం!

శాంత రావణాసురుడు కూతురు! ఎవరితేపం? ప్రస్తుతం మనవాడికి నెత్తిమీాది దేవత, ఆ దేవత అందం చూసి వీడు జసుకున్నాట్ట. జడుసుకుని వెనక్కాలే పడ్డాట్ట! పడి ఘాళీపు కొట్టినట్టు ప్రేమి చేట్ట! ప్రేమించి, తనగుండెకాయపట్టికెళ్ళి ఆ అమ్మాయి పాదాలముందు పడేసి, తెలగపిండి తిన్నట్టు తినెయ్యమన్నాట్ట. ఆఅమ్మాయి తినేసిందట! అదీ ఇందులో కవి హృదయం!

శాంత ఏదో ఇత్రరతనం అయి ఉంటుంది.

జగ : ఆ! నువిల్లా వెనకేసుగొస్తుంటేనే వాడత ముందుకి దూకాడు చివరికి పెళ్ళి చేసుకుంటానని కూడా ప్రమాణం చేశాట్ట!

శాంత : ప్రమాణం కూడానా (నోరునొక్కుకుని) అవ్వ! ఎంతకని చేశాడు? ఇప్పుడెల్లా? పానీ ఆ అమ్మాయి స్థితిగతు లేమిటో, వంశమేమిటో—

జగ : ఏమీ అక్కర్లేదు! ఆ పెళ్ళికి నేను ఎంతమాత్రం అంగీకరించ దలుచుగోలేదు! నువ్వూ వాడూ కలిసి ఏమున్నా వూహాలు పన్నుతారేమో, అసలా సంబంధం గురించి ఈ ఇంట్లో ఇక ప్రస్తావించడానికి వీల్లేదు. తెలిసిందా!

శాంత : మీామాట నేనెప్పుడేనా కాదన్నానా? కాని సుంద రంసంగతి మీాకు తెలుసుగా? వాడు ససేమిరా అంటే —

జగ : నేను ససేమిరాఅంటాను. ఆబ్బాయి అర్థాంతరంగా వ్యవహరించి 'వంశమర్యాద మంటగలువుతూంటే చూస్తూ ఊరుకోడానికి నేనేమీా చేతగాని వాణ్ణి కాదు. ఈ ఇంట్లో నేనున్నంతకాలం నామాట జరిగి తీరాలి. నేను సుందరానికి అన్నివిధాలా యోగ్య మైన మరో సంబంధం నిశ్చయం చేసుగొచ్చాను.

శాంత : మరో సంబంధమా ? మీాకూ ఇంత పట్టుదలయితే ఎల్లాగండీ? వాడు వెళ్ళి పిల్లని చూసుగోవద్దూ'

జగ : ఇంకా చూడ్డం ఏమిటే తాంబూలాలు పుచ్చుకుందుకు పెళ్ళివారిని ఇప్పుడే అయిదుగంటలకి రమ్మన్నాను. అంతా స్థిరపడిపోయింది

శాంత : వాడేమన్నా గొడవ పెడతాడేమో'

జగ ఇంట్లోంచి బయటికి నడవమంటాను.

శాంత (ఏడుపు ఆపుగుంటూ) అవేం మాట్లండీ ? నిక్షేపం లాంటి సంసారంలో ఎన్ని గొడవలొచ్చాయి? మీరా పట్టుదలకి రెట్టింపు పట్టుదల వాడిదగ్గరుంది. పైగా దురుసుమనిషి కూడాను.

జగ ; అయితే!

శాంత : కాస్త ఆలోచించండి ! తప్పులు క్షమించి ఆదుకో వలసిన కన్నతండ్రే విసిరికొడితే విసుగెత్తి వాడే అఘాయిత్యమేనా చేసే జన్మంతా మధ్య నేను అలోలక్షణా అని ఏడవాలి! (అని ఏడుస్తుంది.)

జగ : ఏడిసినట్టే ఉంది! వాడూ, వాడి తరఫున వకాల్తనామా పుచ్చుకుని నువ్వూ ఇల్లా తయారవుతారని నాకు ముందే తెలుసు. ఇంక ఆ కుళాయి కట్టేయి! మనవాడు ప్రేమించిన కమల సంబంధమే స్థిరపరుచు గొచ్చాను!

శాంత ; (ఆనందంతో, కళ్ళుతుడుచుగుంటూ) నిజమే! మీరెంత మంచివారండీ! (జగన్నాథం నవ్వుతాడు )

జగ : అవునులే! మనకి జరిగిన లాభంబట్టేగా అవతలవాడి మంచి కొలవడం!

శాంత: మీతో ఎవరూ మాట్లాడలేరు గాని, ఆ కమల ఎవరండీ ?

జగ : సర్కిలు ఇనస్పెక్టరు విక్రమరావు లేదూ !

శాంత మొన్న ధైర్యంగా మ టల్లో దూకాడన్నారూ !

జగ : ఊ. ఆయనే! ఆయనకి ఈ కమల ఒకత్తే కూతురు. అమ్మాయి బాగుంది B. A చదువుతోంది ఆస్తి ఫరవాలేదు పైగా అ బ్బాయి ఎన్నుకున్నాడు. అంచేత విక్రమరావుగారిని తాంబూలాలు పుచ్చుకు దుకు ఈసాయంత్రమే అయిదుగంటలకివచ్చెయ్యమన్నాను. (ఉత్సాహంతో) అయిదవుతోంది!

శాంత: ఊ! (ఆలోచించి, నిరూత్సాహంగా) చివరకి మీరన్నీ ఇల్లాగే చేస్తారు.

జగ : ఏం ?

శాంత: నాకొక్కగా నొక్క కొడుకుగదా. వాడి పెళ్ళి విషయంలో నాప్రమేయం ఏమీలేకుండాచేస్తారా ? నేవెళ్ళి పిల్లనుచూసుగోడం. నాకు నచ్చడం, కట్నాలూ కానుకలూ మాట్లాడుకోడం ఏమీ అక్కర్లేదనుకున్నారా ! కొడుకుగారు రహస్యంగా ప్రేమించారు, తగుదునమ్మా అంటూ తండ్రిగా రెళ్ళి. ఖాయపరుచు గొచ్చారు. పైగా ఇందాకణ్నుంచీ నన్నాడిపొసుగున్నా రెండుకూ మధ్య

జగ : ఇంతావిని మళ్ళీ నువ్వు న ణు గు డు మొదలెట్టావేమిటి ? కట్నాలూ- కానుకలూ అన్నీ లాభసాటి

గానే స్థిరపరుచుగొచ్చాను. ఇక అమ్మాయి ఉం టుంది! బంగారపు బొమ్మ! ఎఱ్ఱగా, సన్నగా, నాజూగ్గా, రెండు జడలేసుకుని.

శాంత: (అడ్డొచ్చి, చిరాగ్గా చూస్తూ) రెండు జళ్లేసు కుంటుందా! అయితే మనకొద్దు.

జగ : రెండు జళ్లేసుకునే అమ్మాయంటే నాకసలు ఒళ్ళుమంట. సుబ్బరంగా పసిపాటా నేర్చిన పిల్లయి ఉండాలిగాని, రెండుజడలూ, పదహారు జడలూ వేసుగుని సింగు సింగూమంటూ తిరుగుతూ ఉం టుంటే ఇంక మనకేంచేస్తుందంటీ?

జగ : బాగుంది! నీకు అభ్యంతరమల్లా రెండుజడలేగా? పెళ్ళవగానే సినిమట్టించెయ్యి!

శాంత: అసలీ సుందరం వ్యవహారం నాకేం నచ్చలేదండి. రానీండి చెబుతాను. మొహం వాయకొడతాను.

జగ : ఏమో! విడాసాలొచ్చిన కొడుకుల్ని మిత్రుల్లా చూసుకోవడం తల్లిదండ్రులికి మంచిది.

శాంత: ఏమీ ఫరవాలేదు. అసలు నేను కళ్ళెర్రచేశానంటే వాడు గజాగజా వణకిపోతాడు.

జగ : ఏమీ లాభంలేదు. ఆ అమ్మాయి కళ్ళు సన్న చేసిందంటే వాడు గటగబా బలిసలేచి చక్కా పోతాడు.

౧

శాంత : నాదగ్గిర చెబుతారు ఎన్నికబుర్లేనానూ!- ఇల్లా నీ ఇష్ట మొచ్చినట్లు ప్రేమించడమేనా? మంచీ చెడ్డా చూసుగోక్కర్లేదా? పెద్దవాళ్ళని అడగక్కర్లేదా! అని వాణ్ణి గట్టిగా నాలుగుమాటలు అడగలేరు! ఇంక వాడికి భయమూ, భక్తి ఎక్కణ్ణించి వస్తాయి! ఏదో సంబంధం మంచిదయిందిగనక సరిపోయింది

జగ : ఎందుకడగనూ? అడుగుదామనే నీదగ్గిర రిహార్సలు వేశాను! నువ్వు మళ్ళీ మధ్యలో అడ్డంపడి అగ మన్నావంటే జాగ్రత్త! అన్నట్టు మరోటి! నేను ఈ సంబంధమే స్థిరపరుచు కొచ్చినట్లు పెళ్ళివా రొచ్చేలోపల అబ్బాయి కెంతమాత్రం తెలియ కూడదు. తెలిసిందా? రంగయ్యా! రంగయ్యా!

రంగ : (L F- లోంచి వచ్చి) ఏం బాబయ్యా ?

జగ : లోపలికెళ్ళి మంగమ్మగార్నడిగి వేడివేడి కాఫీపట్రా!

రంగ : సిత్తం !

శాంత : రంగయ్యా! అబ్బాయికి పెళ్ళివా రొస్తున్నారు.

రంగ : ఏటీ? సుందరంగారికే? ఏవూరండి !

శాంత : (ఉత్సాహంతో) ఈ వూరే - నర్సులుగా రమ్మాయి! B A. పిల్ల !

రంగ : (ఆనందంతో) ఏటి సెప్పారుగారేం ?

జగ : (విసుగ్గా) చెప్పి గంటయింది! వెళ్ళి కాఫీ తీసుకురా! (రంగయ్య R. F. లోకి వెడతాడు. జగన్నాథం శాంతకేసి కోపంగా చూస్తాడు.)

శాంత : ఏం అల్లా చూస్తారేం ?

జగ : నోట్లో నవ్వుగింజనానను! ఇప్పుడేనా సంబంధం విషయం రహస్యంగా ఉంచవే అని చెప్పాను.

శాంత : మరీబాగుంది. వీడికి చెబుతే ఏమంది ?

జగ : వీడెళ్ళి వాడురాగానే చెప్పెయ్యడుటండీ ! అప్పుడు నేనేమని కేకలేస్తానూ !

శాంత : మరిచిపోయానండీ! (రంగయ్య కాఫీ తెస్తాడు.)

జగ : రంగయ్యా ! ఈ పెళ్ళి సంబంధంమాట మన సుంద రానికేమీ తెలియకూడదు.

రంగ : అదేటిబాబయ్యా! పెళ్ళి కాయమయిందన్నారుగా !

జగ : అయిందనుకో!

రంగ : అయితే ఇంకేటండీ! అబ్బాయిగారికోసం గుమ్మంలో కాత్తాను. ఆరు రాగానే ఒక్కగుక్కలో సెప్పే త్తాను. నవ్వుతున్న ఆబాబుని ఎత్తుగు తీసుగొత్తాను ఇంట్లోకి !

జగ : (నవ్వుతూ) బావుంది ! (కోపంగా చూసి) వీడు-బజారెళ్ళి ఏమన్నా తేవాలిటే

శాంత : (ముభావంగా) అన్నీ పొద్దున్నే తెచ్చాడు.

జగ : (కోపంగా నవ్వుతూ) ఉహూ ! ఒరేయి. నువ్వో తక్షణం బజారుకెళ్ళి - బజారుకెళ్ళి గెమేక్సీను పట్టా రూపాయి ఇదిగో! (అని, తీసి ఇస్తాడు)

రంగ : (పుచ్చుగుంటూ) ఏటండదీ !

జగ : పురుగుల విషంరా! బొజ్జింకలూ, నల్లులూ, అవీ చావడానికి

రంగ : ఒహో అదాండి. గెమాస్కీము!

శాంత: (అయిష్టంగా చూస్తూ) ఇప్పు డెందు కండీ?

జగ : ఎందుకేమిటే అక్కడ ఆఫీసులో బీరువాల్నిండా పురుగులు జేరి పుస్తకాలన్నీ తగలేస్తున్నాయి. ఎప్పటి కప్పుడే చెబుదామని మర్చిపోతున్నాను. వెళ్ళి తీసుకురా!

రంగ : సిత్తం! (అని L. F. కేసి తిరుగుతాడు)

జగ : ఇల్లాదొడ్డిదారమ్మట వెళ్ళు! ప్రతీదానికి హాల్లోంచే తయారవక్కర్లేదు!

రంగ : సిత్తం! (అని R F లో కి పోతాడు.)

శాంత: (వెనక్కాలే వెడుతూ) త్వరగా రా! పెళ్ళివారొస్తున్నారు!

జగ : (జేబులోంచి ఉత్తరంతీసి చదువుతూ, శాంత వెనకాలే నడుస్తూ హేళనక్రింద అభినయిస్తూ) ఒకర్నొకరు భాగా ర్థం చేసుకున్నాం. మనసారా ప్రేమించుకున్నాం

శాంత· (గబుక్కుని ఆగి) చాల్లెద్దురూ! మీకెక్కడా మతి పోతోందేమిటి! ఎవరేనా వింటే నవ్వ్వరటానేనా

లేదు మనిషికి ఇన్నేళ్ళొచ్చి. పైగా ఇపడు ప్రేమట!
(అని సిగ్గు పడుతూ చిరునవ్వుతో కొప్పడుంది)

జగ : (విసుగ్గా) నీ మొహంలా ఉంది! నేను నేను చదువు
తున్నది ఈ వుత్తరం!

శాంత: (నిరాశగా) అంతేనా?

జగ : (L. F.లో ఏదో విన్నట్టు నటించి) అదుగో సైకిలు
చప్పుడయింది! సుందరం వచ్చాడు. నువ్వక్కడ
కూ- నేనిక్కడ కూచుంటాను. వాడు వచ్చే
టప్పటికి మనం కోపంతో మాటమాట లాడిపోతాం.
డాలి తెలిసిందా? దాంతో వాడు పిల్లి అయి
పోయి "అదేమిటమ్మా!" అంటూ ముందు నీకేసి
తిరుగుతాడు ఆమట్టిగా నేను అడ్డమొచ్చి "ఏడిశావు
నోర్ముయి!' అని అందుకుంటాను

శాంత: (భయంగా చూస్తూ) మరీ గట్టిగా కేకలెట్టకండేం?
వాడలే దురుసుమనిషి!

జగ , అల్లానేలే. వస్తున్నాడు!

(జగన్నాథం, శాంత కంగారుగా కూచుని L F కేసి కోపంగా చూస్తూ ఉంటారు. సుందరం వచ్చి, వీళ్ళ నసలు గమనించకుండా ఉత్సాహంగా కూని రాగం తీసుకుంటూ M. B. లోకి చక్కా పోతాడు. జగన్నాథం తెల్ల బోతాడు. శాంత నవ్వాపుకుంటుంది. అదిచూచి జగన్నాథం కోపంతో హుంకరిస్తూ లేచి)

జగ : సుందరం! సుందరం!

సుంద : (M. B. లోంచి వచ్చి. యథాలాభంగా) ఏం
నాన్నా!

జగ : (ఎగాదిగాచూసి) నువ్వు అవకాశ మిస్తే రెండు మాటలు మాట్లాడతాను!

సు ద : ఆదేమిటి నాన్నా, అల్లా అంటున్నారు!

జగ : మా ఇద్దరి అవసరమూ నీకు ఇంక పూర్తిగా అనవసరమని తేల్చేశావు, గనక !

సుంద : (తెల్లబోతూ) నేనా

జగ : ఆ! అక్షరాలా నువ్వే! తల్లిదండ్రులికి కొడుకుమీద ఎంత మమకారం ఉటుందో, ఎన్ని ఆశ లుంటాయో, తండ్రి అయ్యేదాకా ఏకొడుక్కీ తెలిసిరాదు. కాని చదువూ సంస్కారమూ కల వాడివికదా, కొంతేనా ఊహించుగో లేవూ ? ఊహించుగున్నా కనీసం మా ఇష్టా యిష్టాలు గుర్తించవలసిన గౌరవానికి కూడా మేం తగమను కున్నావా ! ఏమిటసలు నీఉద్దేశం !

సుంద : (ఏమీ అర్థంకాక, తల్లివైపు తిరిగి) ఏమిటమ్మా ఇది !

శాంత : అది కాదురామరీ! (అని ప్రారంభించి జగన్నాథం కోపం చూసి ఆగిపోతుంది)

జగ : నేను నిన్నడిగాను. నిజం చెప్పగలిగిన ధైర్యంఉంటే నాకు చెప్పు.

సుంద : మీారడిగే దేమిటో నాకు అర్థం అవటంలేదు. అయినా మీా కిష్టంలే దీ, కష్టంకలిగించేదీ, ఏపనీ ఎప్పుడూ నేను చెయ్యలేదు.

జగ : (యీసడింపుగా) ఒక్క-ముక్క-లో కొట్టేశాడు !

సుంద : పోనీ మీరు చెప్పండీ నాన్నా ! నేనే తప్పు చేశాను !

జగ : అయితే నే నడిగిన వాటికి డొంకతిరుగుళ్లు, తిర క్కు-ండా, అబద్ధమాడకుండా నిజంచెబుతావు !

సుంద : చెబుతాను.

జగ : మన వంశానికి ఏమన్నా గౌరవప్రతిష్ఠ లున్నాయా!

సుంద : ఉన్నాయి

జగ : ఆ గౌరవ ప్రతిష్ఠలు నిలబెట్టవలసిన సమిష్టి బాధ్యత మనందరిమీాదా ఉందా !

సుంద : ఉంది.

జగ : అందులో నే నెక్కు-వ బాధ్యత వహించానంటావా, లేదంటావా !

సుంద ; లేదనేటంత నీచుణ్ణికాదు నాన్నా, నేను!

జగ ; ఫరవాలేదులే! ఏవిషయంలోనేనా బాధ్యత ఎక్కు-వ వహించిన వాళ్ళకి హక్కు-లుగూడా ఎక్కు-వ ఉండడం న్యాయమేనా !

సుంద ; న్యాయ మేమిటి నాన్నా, ఉండితీరాలి.

జగ ; అలాంటప్పుడు, ఈ వంశ విస్తరణ విషయంలో స్వతంత్రంగా, నిరంకుశంగా వ్యవహరించడానికి నీకు ఒక్క-డికీ పూర్తిహక్కు- ఉందా !

సుంద ; లేదు !

జగ : లేదని తెలిసికూడా ఆహక్కు నువ్వెందుకు పుచ్చుకున్నావు ' మమ్మల్ని విస్మరించి, స్వతంత్రించి పెళ్ళి చేసుకుంటానని ప్రమాణం ఎందుకు చేశావు!

సుంద : పెళ్ళా ' ప్రమాణమా ' (తెల్లబోతాడు)

జగ : అవునురా. కమలకి!

సుంద : (హడలిపోయి) కమలా!

శాంత: మరేరా. సర్కిలుగా రమ్మాయి!

సుంద : (నమ్మలేనట్టు చూస్తూ) మీకెలా తెలుసూ!

జగ : (శాంతతో) నువ్వు నోర్మూయి. (సుందరంతో) ఎవర్రా ఈ కమల!

సుంద : కమలనాన్నా! (తబ్బిబ్బయిపోయి) అదే! విక్రమరావుగారి అమ్మాయి.

జగ : నువ్వు ప్రేమించావా '

సుంద : (ఆశగా చూస్తూ) మరే నాన్నా!

జగ : (గంభీరంగా) ఎందుకు ప్రేమించావు!

సుంద : (తెల్లబోయి) ఎందుకా!

జగ (దగ్గరగా వస్తూ) ఏం! అలా తెల్లబోతావేం! ప్రేమించి పెళ్ళి చేసుకోకుండా బతకలేనని ఎలా నిర్ణయించుకున్నావు ' నిర్ణయించుకుని పెళ్లి చేసుకుంటానని ఏ ధీమాతో స్వతంత్రించి ప్రమాణం చేశావు! అసలు మేం యిద్దరం బ్రతికున్న సంగతి మరచిపోయావా! అనవసరం అని తేల్చుకున్నావా.

ఏం మాట్లాడవేం! (అంటూ ఆధూకుడులోనే మధ్య
నున్న శాంతతో)-your honour! ఒహోనువ్వా!
నువ్వు మళ్ళీ ఎందుకు లేచావు? మాట్లాడొద్దని
చెప్పలే

శాంత (ఉక్కు రోషంతో) మీరన్ని ప్రశ్నలూ ఒక్క
సారే అడిగేస్తూంటే వాడు సమాధానం ఎలా
చెబుతాడు?

జగ : అదా నీహాలింగు! ఏమీ కష్టంలేదు. వీటన్నిటికీ
ఒకటే సమాధానం. వెఱ్ఱిమొహం వెయ్యడ
నువ్వుకూడా వేసుకుని అలాకూచో.

సుంద : క్షమించండి నాన్నా. ఏరోజు కారోజే మీతో
చెబుదామనుకుంటున్నాను. గాని అవకాశం చిక్క
టంలేదు.

జగ : ఈ శషభిషలేం నాదగ్గర పనికిరావు. నువ్వు హద్దు
మీరి వ్యవహరించావా లేదా!

సుంద : మీరుకూడా పూర్తిగా అంగీకరిస్తారని ఆశించాను,

జగ : (బింకంగా)నువ్వు హద్దుమీరివ్యవహరించావాలేదా

సుంద : ఇది నాజీవిత సమస్య నాన్నా!

జగ : (గొప్పలంగా, మొండిగా) నువ్వు హద్దుమీరి వ్యవ
రించావా లేదా!

సుంద : వ్యవహరించాను.

జగ : అందుకనే చెబుతున్నాను. నేనీ పెళ్ళికి అంగీక
రించను.

సుంద : నాన్నా ! మరోసారి ఆలోచించండి. నేనూ కమలా మనసారా ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకుంటా నని ప్రమాణం కూడా చేశాను.

జగ : నీకేం భయంలేదు. ఏ వస్తువు మీాదేనా హక్కు ఇచ్చేవాడికే లేకపోతే పుచ్చుకునేవాడికి ఎక్క ణ్ణుంచి వస్తుంది ? Scale of goods Act. కర్తకే హక్కులేని ప్రమాణం భూమిామ్మీద ఏ కోర్టులోనూ చెల్లదు

సుంద : నామాట వినండి, నాన్నా !

జగ : పాయింటు లేకుండా వాదించకు, సుందరం! ఇంక ఆ గొడవ ఒదిలేయి. నేను మరో సంబంధం నిశ్చయం చేసుకొచ్చాను

సుంద : (దెబ్బ తిన్నట్లు చూస్తూ) నాన్నా ! మరో సంబం ధమా ?

జగ : అవును ! సంబంధం అన్నివిధాలా యోగ్యమైంది. ఆస్తిపాస్తు లుండీ, చదువూ సంస్కారమూ కలిగి, అంద చందాలతో నిండినపిల్ల, తాంబూలాలు పుచ్చుగుందుకు పెళ్ళివారిని ఇప్పుడే అయిదుగంటలకి రమ్మన్నాను.

సుంద : వీల్లేదు, నాన్నా ! నాకమలకి నేను ద్రోహం చెయ్యలేను. ఈపెళ్ళి చేసుగోడానికి నేనెంతమాత్రం అంగీకరించను.

జగ : అయితే నీకమలకోసం కన్న తల్లిదండ్రులకి కూడా ద్రోహం చెయ్యటానికి సిద్ధపడతావన్న మాట!

సుంద : అంతమాట అనకండి నాన్నా! మీరిద్దరూ నాకు దైవసమానులు. కమల నాప్రాణం! ఏమిటమ్మా ఇదంతా ?

శాంత : (తోసుకొస్తున్న బాధ ఆపుకోలేక) బాధపడకు సుందరం! (భర్తతో ప్రార్థిస్తున్నట్టు) ఏమండీ!

జగ : నువ్వేంమాట్టాడ్డానికి వీల్లేదు!

శాంత : (ఏడుస్తూ) నేనింక ఊరుకోలేను!

జగ : అయితే వెంటనే లోపలికెళ్ళు! వెళ్ళు! (శాంత భర్తవైపు రోషంతో చూచి R F లోకి వెళ్ళిపోతుంది) ఆలోచించుకో సుందరం! అవతల పెద్దమనిషికి మాటిచ్చాను. నాగౌరవమర్యాదలనీ, నీ ప్రేమ వ్యవహారాలనీ తూచుకు చూసుకో! తేల్చుకుచెప్పు!

సుంద : పోనీ ఈ సంబంధం విషయం నాతో ముందుగా చెప్పకపోయారా ?

జగ : నువ్వేమన్నా ముందుగా నాతో చెప్పావు, కనకనా? ఏదో కాలేజీకి వెడుతున్నావు, బుద్ధిగా చదువుకుంటున్నా వనుకున్నాను గాని, మధ్యలో మిఠాయి దుకాణం పెట్టావని నాకేం తెలుసు! జరిగిందేదో జరిగిపోయింది. అదంతా మర్చిపో!

ఇహనో ఉప్పుడో పెళ్ళివారొచ్చే సమయంకూడా సమీపించింది. నా గౌరవం నిలబెట్టదల్చుకున్నావో, గోరీ కట్టెయ్య దల్చుకున్నావో నిర్ణయించుకో! నా నిర్ణయంమాత్రం మారదు, లోపల పనుంది. అయిదు నిమిషాల్లో వస్తాను (అని విసురుగా R F. లోకి వెళతాడు)

రంగ : (చేత్తో పొట్లం పుచ్చుకుని L F లోంచి వస్తూ, ఉత్సాహంగా) వచ్చారా, బాబయ్యా!

(సుందరం ఖిన్నుడై R F లోకి చూస్తూ ఉండిపోయి, నిట్టూర్చి, ఆవేశంతో L F వరకూ నడిచి ఆగిపోయి ఆలోచించి వెనక్కి తిరిగి సోఫావైపు వస్తూ "చివరికి ఇల్లా అయింది నా బ్రతుకు!' అనుకుని కోటు తీసేసి విరక్తితో సోఫాలో గిరటవేసి, సోఫాలో కూలబడింది, బరువుగా, భారంగా చేతుల్లో ముఖం దాచుకుని మథనపడతాడు.

సుంద : ఏమిటది, రంగయ్యా!

రంగ : ఇదమండి!

సుంద : (ఆశ్చర్యంగా) ఆ! విషమా!

రంగ : (విసుగ్గా) ఆ అయ్యగారికి పని లేకపోతేసరి! శుభమాఅంటూ పురుగులవిషం తెమ్మన్నారు. (అంటూ ఆ పొట్లం రేడియో బల్లమీద ఉంచేసి, నవ్వుతూ ఆనందంతో) ఇది సరేగాని, తమరింకా ఇల్లా కూచున్నారేం!

రంగ : ఇదేటండీ! తాంబూలా లిచ్చుగుందుకు పెళ్ళివా రొత్తూంటే పెళ్ళికొడుకుగారు ఎల్లా ఉండాలి శాకలా పోకు సేసుకొని వాల్ రైట్ నెంబరు వన్‌లా ఉండాలి! రండి.

సుంద : (బాధగా) నేనంటే నీకూ ఇంత వేళాకోళంగా ఉందా రంగయ్యా!

రంగ : అబ్బా! ఈసిగ్గూ, సీటపటలూ చదువుకున్న రాత్రిళ్ళకి సామాన్యమే! కానండి అబ్బాయిగారు! ఇంక మీాసైకిలికి దీపం నేకపోయినా ఇబ్బంది నేదు.

సుంద : (గట్టిగా) రంగయ్యా!

రంగ : (హడలిపోయి) ఏటండీ!

సుంద : (కోపంగా లేచి) వాగుడు కట్టిపెట్టి నోరు మూసుకుని లోపలికెళ్ళు)

[రంగయ్య తెల్లబోయి చూసి ఏమీ అర్థమవక R. F. లోకి పోతాడు. సుందరం విసుగెత్తిపోయినట్లు చూసి M. B. వైపు విసురుగా తిరిగి, రేడియో బల్లమీాదున్న విషంపొట్లం దగ్గర ఆగిపోతాడు. బల్లనివమీ క్షించి ఆపొట్లం తీసి, తీక్షణంగా చూస్తూ ఆలోచిస్తాడు. నిట్టూర్చి, తల త క్రించి పొట్లం రేడియో బల్లమీాద ఉంచేస్తాడు. రంగయ్య సాసర్లతో నాలుగు కాఫీ కప్పులు నిండుగా ఉన్న కాఫీపాట్ ఒక ట్రేలో ఉంచిపట్టు గొస్తాడు]

సుంద : ఇదంతా ఎవరికి, రంగయ్యా!

రంగ : (ముఖభావంగా) పెళ్ళోరికండి!

సుంద . నాన్నగారేం చేస్తున్నారు ?

రంగ : మేడమీద కెళ్ళారండి !

సుంద : అమ్మగారూ !

రంగ : ఆయానండీ ! ఆదేటోగాని అమ్మగారొక్కరూ కదుల్తే అయ్యగారు కస్సుమంటున్నారండి!

సుంద : (రోషంతో) ఊహూ! తమరిమాట నెగ్గి చుగు తీర్తారన్నమాట! ఒరే! ఒరేయి నువ్వు వీధులో కూచుని ఎవరేనా వస్తూంటే చెప్పు!

రంగ : అమ్మగారు పిలుత్తారండి !

సుంద : (కోపంతో) జన్మఅంతా వాళ్ళకే చెయ్యరా ! ఈ ఒక్కసారీ నామాట విను ఇంకెప్పుడూ ఏమీ అడగను.

రంగ : మాటంటేనే అంత కోపం ఎందుకండి ? ఎడుతున్నానుగా. (L F లోకి వెళతాడు.)

[సుందరం గబగబా రేడియోబల్లదగ్గిరికి వెళ్ళి, ఆపొట్లం తీసుకువచ్చి నెర్వస్‌గా ఇప్పి, రెండు మూడు చెమిచాలు ఓకప్పులో వేస్తాడు. మళ్ళీ మరోరెండు చెమిచాలు వేస్తాడు పొట్లం మళ్ళీ యథాప్రకారం కట్టేసి, రేడియోబల్లమీద పెట్టేసివచ్చి నిశ్చయించుకున్నట్టు చూస్తూ, ఆకప్పు సాసరుతో సహా తీసి చేత్తో పట్టుకుని మళ్ళీ ఆలోచన వేసినట్టు రేడియోబల్లకేసి నడుస్తాడు. రంగయ్య L. F లోంచి తొందరగా వస్తాడు సుందరం కప్పు సాసరు హడావుడిగా రేడియోమీద ఉంచేసి రంగయ్య అది కనపడకుండా నుంచుంటాడు ]

సుంద : (నెర్వస్‌గా నవ్వుతూ) ఏం రంగయ్యా ?

రంగ : అర్జంటుగా మాట్లాడాల్టండి. తమకోసం ఎవరో అమ్మాయిగా రొచ్చారు.

సుంద : (విసుగ్గా) ఎవరా అమ్మాయి !

రంగ : ఎవరో కమలమ్మగార్టండి !

సుంద : (ఉత్సాహంతో) కమలా! (అని రంగయ్యని పక్కకి నెట్టి L. F లోకి తొందరగా వెడతాడు)

[R. F లోంచి జగన్నాథం, శాంత వస్తారు]

జగ : అబ్బాయి ఏడిరా ?

రంగ : ఎవరో అమ్మాయిగారొత్తె ఇప్పుడే ఈధులో కెల్లారండి.

జగ : అమ్మాయా ?

రంగ : మరేనండి. కమలమ్మగారంట!

శాంత : ఏమిటీ ! కోడలుపిల్లే! చూశారా, మామగారికంటె నాలుగాకులు ఎక్కువే చదివింది కోడలు !

రంగ : ఏటీ? ఈఅమ్మాయిగారే పెళ్ళికూతురు ?

జగ ; (విసుగ్గా) ఆ! సమయానికొచ్చి స్వారస్యం కాస్తా చెడగొట్టింది ఒకేయ్! నోరు తేలేసుగుని అల్లా నుంచోకపోతే ఆ టేబుల్ అక్కణ్ణించి తీసెయ్యకూడదూ! నలుగురూ వచ్చినప్పుడు అడ్డంగా పెట్టద్దని చెప్పలే ?

[L, F లోంచి 'జగన్నాథంగారూ! జగన్నాథంగారు' అని కేకలు వినిపిస్తాయి]

అదుగో పెళ్ళివారొచ్చినట్టున్నారు. సమయానికి వాళ్ళో ఒక్కమూ ఉండదు. వెళ్ళి లోపలికి తీసుగురా, రంగయ్యా!

శాంత ; ఒరేయి. నువ్వాపనిచూడు! మీరెళ్ళి తీసుగురండి!

గ : (చురచుర చూస్తూ) పెళ్ళికొడుకు తల్లికదూ! ఇదా మొదలు! (తొందరగా L. F లోకి వెడతాడు.)

శాం.త: (రంగయ్య ట్రే రేడియో బల్లమీద పెట్టాడు) ఆ పొట్లమేమిటి రంగయ్యా!

రంగ : ఇదాండి. పురుగుల మందండి!

శాంత: ఖర్మ! మతిలేకపోతేసరి. అవి పట్టికెళ్ళి వారి ఆఫీసు గదిలో పారెయి. ఏగుమస్తావో తింటాడు. తీరిపోతుంది.

(రంగయ్య పొట్లం తీసుకుని M. B. లోకి వెడతాడు. శాంత చీర వగైరా ఉత్సాహంతో సర్దుకుంటుంది L.F. లోంచి జగన్నాథం సర్కిలు ఇన్స్పెక్టరు విక్రమరావు వేదాంతి జ్ఞానశ్రీ ప్రవేశిస్తారు.

జగ : (వారికి కుర్చీలు చూపిస్తూ) దయచేయండి. ఏమేవ్! మనవియ్యంకులు విక్రమరావుగారు! (విక్రమరావు నమస్కరిస్తాడు)

శాంత: అలానా? నమస్కారమండి.

జగ : (జ్ఞానశ్రీవైపు చూపిస్తూ) వీరు!

విక్ర : మా మామగారు! జ్ఞానశ్రీగారు.

జగ : (ఆశ్చర్యంగా) ఏమిటీ! సాక్షాత్తు ఆజ్ఞానశ్రీగారే! దయచేయండి. ఇన్నాళ్ళూ తమ అమూల్య వేదాంత రచనలు పారాయణ చేసుకోవడమేగాని తమర్ని దర్శనం చేసుకునే అదృష్టం కలుగలేదు. ఈవాళ తమరాకతో మా ఇల్లు నిజంగా పావనమయింది. (జగన్నాథం, శాంత నమస్కరిస్తారు

జ్ఞాన : చాలాకృతజ్ఞుణ్ణి! (నమస్కరిస్తాడు. అంతా కూచుంటారు)

జగ : ఎంతమాట. (శాంతతో) వారెవరో తెలుసా! మన దేశానికి విజ్ఞానదీపం అని ప్రఖ్యాతి చెందినవారు. వేదాంత పరిజ్ఞానంలో అద్వితీయు లనిపించుకున్న వారు.

శాంత: అలానా? మనసు దరనిజంగా అదృష్టవంతుడండీ!

జగ : ఇంకాస దేహమా! అన్నట్లు భగవద్గీతావాఖ్యానం తరువాత మళ్ళీ తమరేమైనా రాశారా?

జ్ఞాన ; రచనకూడా ఒక వ్యసనమే! అలవాటుపడ్డ చేతికి చెయ్యాడుతున్నంతసేపూ ఆట విడుపు ఉండదు: అంతా భగవత్సంకల్పం ఈమధ్యనే ఉపనిత్సారమనే రచన పూర్తిచేశాను అచ్చవుతోంది.

జగ ; ఉపనిత్సారమే! చాలాబాగుంది.

శాంత; రంగయ్యా! కాఫీలు తీసుకురా.

జ్ఞాన ; ఈమధ్య జరిగిన ఘోర అగ్నిప్రమాదంలో మా అల్లుడు చూపెట్టిన స్థైర్యసాహసాలకి నేను కేవలం ముగ్ధుణ్ణాయి, పండితుణ్ణి మాత్రమే గనక, ఈ గ్రంథాన్ని ఆతనికి అంకితం ఇయ్యదలచాను.

జగ ; తప్పకుండా ఇవ్వవలసిందే.

విక్ర ; ఆ! మంటల్లో దూకడంకూడా ఒక ఘనకార్యమే? ఇట్లాంటివి మా ఉద్యోగంలో నిత్యకృత్యాలు.

శాంత: (ఆశ్చర్యంతో) ఏమిటి? నిత్యం ప్రత్యేలా?

విక్ర : అక్కగారు ఈమాత్రానికే ఆశ్చర్యపడుతున్నారు. నేను మిలటరీలో పనిచేసిన రెండేళ్ళలోనూ ప్రతీ రోజూ రెండు చెవుల్లోంచి తుపాకి గుళ్ళు దూరికే దూసుకుపోయేవి. కత్తులు తెగగీసుకుపోయేవి.

శాంత: అబ్బ! ఇంక చెప్పకండి. నాకు భయమేస్తుంది!
(అంతా నవ్వుతారు)

జగ : ఒరేయి రంగయ్యా!

రంగ : (M B. లోంచి) బాబయ్యా!

జగ : ఏంజేస్తున్నావురా? కాఫీలు ఇయ్యి.

రంగ : సిత్తం!

జగ : (ఉత్సాహంతో) ఊ! బావగారు తాంబూలానికి ఆయుధాల్పుకుని బయల్దేరారేమిటి!

విక్ర : ఇదా! (నవ్వి) బజారులోపని చూసుకుని మామగారు స్టేషనుకొచ్చారు. ఇద్దరం ఇంటికెళ్ళి సక్రమంగా వద్దాం అనుకుంటుంటే ఇంతలో ఏక్సిడెంటని ఫోను వచ్చింది. దాంతో ఆలస్యమయి పోయింది. అంచేత ఇల్లానే చక్కావచ్చాం.

జగ : ఏక్సిడెంటంటే ఏమిటదీ! (రంగయ్యా పాట్ లో కాఫీ ట్రేలో ఉన్న మూడు కప్పుల్లోనూ పోస్తుంటాడు)

విక్ర : ఆ! ఎవడో కుర్రాడిమీదించి [illegible]

జగ : రామ, రామ !

శాంత: పోనీ ఆకుర్రాడు బతిగాడంటీ పాపం !

జగ : ఇంకా బతకడమేమిటే ? మీాదనుంచి వెళ్ళింది. చంటిపిల్లాడి సైకిలనుకుంటున్నా వేమిటి ! దారుణ మైన లారీ !

శాంత: చావులు ఎంత విచిత్రంగా ఉన్నాయి. ఈరోజులలో!

(వాలుగో కప్పుకోసం తటపటాయించి, రంగయ్య కేడి రేూ మీాదున్న కప్పు సాసరు ట్రేలో పెడుతూంటాడు.)

జగ : (విసుగ్గా) ఏరా !

రంగ : ఇదిగోనండి ! (అని కంగారుగా ఆ కప్పులోగూడా కాఫీ పోస్తాడు. చెమటాలతో సుబ్బరంగా కలుపు తాడు)

విక్ర : అసలు విచిత్ర మేమిటంటే, ఆ కుర్రాడు బతిగాడు.

శాంత: (ఆశ్చర్యంతో) ఏమిటీ !

జగ : What ?

విక్ర : పైగా లారీలో ఉన్న డ్రైవరు గుండె ఆగి చచ్చి పోయాడు.

శాంత: అయ్యో !

జగ : చాలావిచిత్రంగాఉందే! లారీక్రింద పడ్డవాడు ప్రాతికి నిక్షేపంలా లారీలో కూచున్న వాడు పోవటమేమిటి !

(రంగయ్య ట్రే తీసుకువచ్చి నిలబడతాడు)

జ్ఞాన : చూపుపడాలేగాని మృత్యువుకీ టుతో పనే ము దండి జనన - మరణములు జనులకు నిక్కము. అడివిలో మన్న. ఆలయుంబుననున్న !

జగ : పంచక్కగా శెలవిచ్చారు! ఎవరి కి ఎప్పుడు ఋణం తీరిపోతుందో ఎవరు చెప్పగలరు! కాఫీ ఇవ్వరా! (కాఫీలు అంతా అందుకుంటారు)

జ్ఞాన : బాధపడవలసింది దాన్నిగురి చికాదు. ఈ ఋణం ఎంత పెంద్రాళే తీరిపోతుందా అని. పాపపంకిలం కదండీ ఈప్రపంచకం విముక్తుడైనవాడే ధన్యుడు. "సంసృజ్యతే స ఉత్క్రా న న్ మ్రియమాణః పాప్మనో విజహాతి" అని ఉపనిషత్తులు ఘోషిస్తు న్నాయి. (అని కొంచెం తాగుతాడు)

శాంత: (కొంచెం చప్పరించి) అల్లానాండి! అయితే ఈ మనుషులకి మృత్యువంటె ఇంకాభయం దేనికండీ!

జ్ఞాన : (కొంచెం చప్పరించి) అజ్ఞానమండీ, అజ్ఞానం! మృత్యువుచేసే పనేమిటి చెప్పం! దేహాన్నుంచి, ఆత్మను వేరుచేస్తుంది, ఇహానికి మనకీ అనుబంధాన్ని అంతరింపచేస్తుంది బ్రహ్మరుద్రులైనా దాని దారికి అడ్డులేరు. అయినాసరే ఈ దేహాన్ని నమ్ముకుని ఇహాన్ని ఆనుకుని మనకి మనమే పొదిగి పెంచుకున్న ఐహిక బంధాలు మనలో శాశ్వతత్వాన్ని ప్రేరేపిస్తాయి కాని అశాశ్వతమయి తీరుతుందని అనుభవం మనకి సిద్ధాంతీకరిస్తుంది. అప్పుడే మనస్సు మధనపడుతుంది. బంధాలను తెంచుకోలేక, మృత్యువుని ఎదుర్కోలేక చివరకి

భయానికి బానిసయిపోతుంది, కాని, అనుభవాన్ని ఆధారంగాచేసుకుని, విద్యని పనిముట్టుగా ఉపయోగించుకుని అర్థంలేని ఈ ఐహిక బంధాలను మనకి మనమే త్రెంచివేసుగున్ననాడు మనకి మృత్యువంటే భయంకాదు, ఖాతరే ఉండదు! (చప్పరి చి మొహం చిట్లించి) కొంచెం పంచదార వెయ్యినాయనా!

జగ : (రంగయ్య ట్రేలో పంచదార కప్పు తెమిచా జ్ఞానశ్రీకి అందించాక ఏపనీ తిన్నగా చెయ్యవు! (అని విసుక్కుంటూ తనూకూడా పంచదారకలుపుకుంటాడు.)

శ్రీ : మృత్యువు గురించి మేమంత ఆలోచించలేను గాని మనకి స్వతహాగా మృత్యువంటే తెగ నిర్లక్ష్యం! ఎంచేతంటే, మృత్యువుకీ మాకూ ప్రతీ రోజూ ముఖాముఖి ఓచిన్న మీటింగవుతూనే ఉంటుంది. అంతేకాదు. చివరికి ఈ మృత్యువుకి కూడా మేమంటే భయమేటి చెప్మా అని విసుగేసుకొస్తోంది! (అని కాఫీ చప్పరిస్తాడు)

జ్ఞాన : (కాఫీ మళ్ళీ పీల్చి) యోధులకి ఆధిక్యారం ఉగు పాలతో వస్తుంది!

జగ : (హాలు దాగా, తలపంకించి, చిరునవ్వుతో) ఆదేం చిత్రమోగాని నాకూ మృత్యువంటే మహా నిర్లక్ష్యం సుమాండి! నిండైన జీవితాన్ని అనుభవించేశాను. గృహస్థాశ్రమ ధర్మాలను అనుసరించి ఆవరించవలసిందంతా చేశాను ఫలితం గురించి అసలు నేనెప్పుడూ ఆలోచించను!

జ్ఞాన : చాలాబాగుంది. కర్మణ్యే వ్యాధికారస్తే మాఫలేషు కదాచన!

జగ : చిత్తం! ఇంక నాకు కావలసిందేముంది, చెప్పండి? "నీఇష్టం వచ్చినప్పుడు రా!" అని మృత్యువుకి కాల దోషం లేని నోటీసు ఒకటిచ్చేసి కూచున్నాను.

శాంత : ఆ మాటకొస్తే ఐహికబంధాలూ, ప్రాపంచిక చింతలూ మగవాళ్ళకంటూ ఆడవాళ్ళకే చాలతక్కువ!

జగ : ఆ మాటమాత్రం ఉంది చూశారూ, అది ఒప్పుకోడానికి ఎంతమాత్రమూ వీల్లేదు! ఒకసారి ఈ మనిషే వజ్రాల వడ్డాణం కావాలని మూడు రోజులు ఉపోషాలుచేసి మరీ సాధించింది!

శాంత: (చిరుకోపంతో) చాల్లెద్దురూ! జీవితానికల్లా నే నడిగింది అదొక్కటేగా! పైగా ఇల్లా మొదలెడితే నే పెట్టుకోడానికి కూడా విసుగేసుగొచ్చి పెట్టెలోనే పడేశాను. అయినా, అవేమన్నా ఆకలితీరుస్తాయా, కన్నుమూశాక కూడా వస్తాయా ఏమిటో! ఆస

లిప్పుడు అబ్బాయికి అన్నివిధాలా తగిన సంబంధం వచ్చిందా, ఇంక నాకే భ్రాంతిలేదు! మ_తైదువుగా మాత్రం ఈ తనువు చాలిస్తే చాలని ముక్కోటి దేవతలకీ మొక్కుతువ్వాను అంతే!

(కాఫీ తాగడానికి బాగుండలేనట్లు మొహంపెట్టి రంగయ్య కేసి కోపంగా చూచి కాఫీ గ్లాసు టీపాయిమీద పెట్టేస్తుంది)

జ్ఞాన : అంతేనండి! దీని పరమార్థం తెలుసుకున్నాక "దేహమే నాటి కానాచి దానిమీద తీపి కొరగాదు" అని పించి తీర్తుంది. శుద్ధ పామరత్వంగాని మన మెంత, తను వెంతండి! ఇది ఉత్తిటీటి బుడగ కదండీ! తేల్తాం, పేల్తాం! అంతే!- "కలుములు నిత్యంబు కావు. మెరపు మెరయురీతి. మేఘంబులట్ల బుద్బుదంబుల భంగి పోవును చెదిరి!"

జగ : ఆహా!- జ్ఞానశ్రీగారూ! మీరు మా ఇంట్లో ఉండి పోకూడదూ!

జ్ఞాన : ఎందుకూ!

రంగ : తమరి పురాణం అత్తమానం ఇనచ్చుగందా అని!- (అంతా నవ్వుతారు)

జగ : పురాణమేమిట్రా, నీ మొహం! - ఈ కప్పులు తీసేయి!

రంగ : చిత్తం! (జ్ఞానశ్రీతో) నాకేటి తెల్దది అయ్యాగారి అభిప్రాయం మాటలకి అర్థాలు పూర్తిగా తెలవక పోయినా మొత్తమ్మీద సంగతే వితో నాగత్తాసండి

జగ : (హేళనగా) ఆ, ఆ! అల్లాగ లాగే. ఒకసారి నా ప్రాణం మీాదికి తెచ్చాడు.

రంగ : (కప్పులుతీస్తూ) ఉండండయ్యాగారూ! (జ్ఞానశ్రీతో) నానో సిన్నసంగతి సెప్పనాండీ!

జ్ఞాన : అవశ్యం చెప్పు ఏమిటది?

రంగ : వేదాంతంకన్నా, ధైర్యంకన్నా, తెలివితేటలుకన్నా సివరికి భక్తికన్నా దరిద్రం గొప్పదండి!

జ్ఞాన : చాలా కచ్చితంగా చెబుతున్నావే!

రంగ ; సిత్తం! ఎంత వేదాంతం తెలిసినా, ఎంత ధైర్యం ఉన్నా, ఎన్ని తెలివితేటలున్నా, ఎంతభక్తివున్నా బ్రతుకుమీాద ఆశ మాత్రం పూర్తిగా పోదండి. కాని దరిద్రం మాత్రం దండిగాఉంటే, బాబయ్యా! మడిసికి బ్రతుకుమీాద ఆశ నత్తెప్ప మానికంగా ఎటనే పోద్ది!

[ఒక్క క్షణం ఒకరికేసి ఒకరు చూసుకుంటారు]

జగ : అరి వీడి శిఖాతరగా! వీడు చెప్పిందాంటో కొంత పాయింటు ఉందండోయి!

జ్ఞాన : లేదండి జగన్నాధంగారూ! నానాబాధలుపడుతూ విముక్తి కోరేవాడికీ, సకలసుఖాలూ అనుభవిస్తూ విముక్తి అర్థించేవాడికీ తేడాలేదూ! అతేకాదు. దారిద్ర్యం, బాధా జాలాక్షరాలు, వేదాంతం విజ్ఞానం శిలాక్షరాలు!

జగ ; అదీ పాయింటేసుండోయి!

(L F. లోంచి సుందరం ఉత్సాహంగా వస్తాడు.)

శాంత అదుగో. సుందరం వచ్చాడు!

జ్ఞాన : ఇతనే నేమిటీ; మన కమలానాథుడు!

జగ : (ఉత్సాహంగా) ఒరేయి సుందరం! వారెవరో తెలుసా? జ్ఞానశ్రీగారు! మీ మామగారికి మావ గారు!

సుంద : (ఉత్సాహంగా) సుప్రీం కోర్టన్నమాట! నమస్కారమండి!

జగ : సంతోషించాం గాని, ఇంత ఆలస్యం చేశావేం?

సుంద : ఆ! ఎవరో స్నేహితుడొస్తేను.

జగ : నాకు తెలుసురా ఎవరొచ్చారోనూ!

సుంద : అదీ తెలిసిందీ! కాని, నాన్నా! మీ రెంత నాటకం ఆడారు!

జగ : ఏమనుకున్నావు మరి? నీ గూడు గుటాణీలు నా దగ్గిర పనికొస్తాయిరా!

సుంద : అమ్మకూడా అలాగే నిలబడ్డాప్పటికి నిజం అనుకుని నేను చాలా బాధపడిపోయాను.

శాంత: (బాధగా) చూశారా? (సుందరంతో) ఏంచెయ్యనురా? మన లెక్కేమన్నా ఉంటేగా! ఆయనకి ఎంతతోస్తే అంతే!

జ్ఞాన : ఏమన్నా న్యూవిషయమా ?

జగ : అదేంకాదు. మంచి తమాషా జరిగింది. జాగ్రత్తగా వినండి! (ఉత్సాహంతో) ఊ! బాధపడి చివరికి ఏమాలోచించావురా ?

సుంద : ఆలోచనేముంది నాన్నా! సర్వనాశనం అయిపోయా ననుకున్నాను. చివరికి నామీదకే అసహ్యమేసి! (అని రేడియో బల్లవైపు చూసి కప్పు, సాసరూ కనపడకపోగా నోరు తెరుచుకుని నిలబడిపోతాడు.)

జగ : ఊ! అసహ్యమేసి? ఏంజేశావు? (అని ఉత్సాహంగా చూస్తాడు.)

సుంద : (బిగుసుకుపోయి) రంగయ్యా! బల్లమీద కప్పు సాసరూ ఏమయాయి!

జగ : అబ్బా, మాట మార్చకుండా చెప్పవోయి! నే చెప్పలా · వీడేదో దూడేసి ఉంటాడు.

సుంద : (కంగారుగా, భయంగా) ఊరుకోండి నాన్నా! రంగయ్యా! అక్కడ కప్పేంచేశావు!

రంగ : (కంగారుగా) అక్కడిదేవా డి?

సుంద : అదేరా ఏంజేశావు ?

రంగ : కాఫీపోసి ఆ రెవరికో ఇచ్చానండి!

సుంద : (హడలిపోయి) ఏమిటి! అదే! (నోరు మూసుకుని గుడ్లుపేల్తున్నట్లు చూస్తాడు.)

జగ : రంగయ్యా! వాడికో కప్పు కాఫీ ఇయ్యి?

శాంత : ఏమిట్రా సుందరం. ఆ అల్లరి !

సుంద : అల్లరి కాదమ్మా ! (చెప్పబోయి సంజ్ఞలు మొదలెట్టి మానేసి) ఎంత దారుణం జరిగిపోయింది ? ఇప్పుడెల్లా ?

జగ : (అనుమానంగా) దారుణ మేమిట్రా !

విక్ర : (లేచి) ఆ, ఏం లేదు ! మీరుండండి ! అసలువిషయ మేమిటో చెప్పకుండా అంత కంగారు పడతా వేమిటి సుందరం ! నువ్వేదో ధైర్యమయిన వాడ వనుకున్నాను నేనూ ? ఏమిటి సంగతి ! (మాట రాక సుందరం భయపడుతూ వెఱ్ఱిగా అందరికేసి చూస్తూ నిలబడిపోయాడు )

జ్ఞాన : కుర్రతనం కదూ కంగారు సామాన్యమే. మరీ ! ఏమిటి నాయనా సంగతి !

శాంత: (బాధగా) సంగతేమిటో చెప్పకుండా ప్రాణం తీసేస్తారు. ఈ వంశంలో ఉన్నదే ఇది ! ఉస్ ! నాకు దడొస్తోంది !

సుంద : (మతోయినట్లుచూస్తూ) వస్తోంది !

జగ : (కాస్త కోపంతో లేచి) ఏడిశావుగాని, ఏమిటి సంగతి !

సుంద : (గుటకేసి, తమాయించుకుని) ఇందాకా నామీద నాకే అసహ్యమేసి, విషంతాగి చచ్చిపోదామనీ !

జగ : (ఆశ్చర్యంగా) ఆ !

శాంత: అయ్యో విషమే! ఎందుకు తాగావురా నాయనా!

జ్ఞాన : ఈ మధ్య విషాలేం పనిచెయ్యటంలేదు! మీరు అనవసరంగా కంగారుపడకండి!

సుంద : (విసుగ్గా) అబ్బ, అసలు నేను తాగందే! కప్పులో విషం బాగా వేసుకున్నాను అందులో కాఫీ పోద్దాం అనుకుంటూంటే కమల వచ్చింది.

విక్ర : (అనుమానంగా) ఊఁ వస్తే!

సుంద : హడావుడిలో ఈ కప్పు శేడియోందరు ఉంచేసి వెళ్ళిపోయాను!

జ్ఞాన : (అనుమానంగా) ఊఁ, వెడితే?

సుంద : (రంగయ్యకేసి చూపెట్టి) ఈ చవట ఆ కప్పులో కూడా కాఫీ పోసి మీలో ఎవరికో ఇచ్చేసినట్టున్నాడు!

విక్ర : (హడలిపోయి) ఇప్పుడు మేం తాగిన కాఫీలో విషముందా!

సుంద : అంతలోనూ కాదండి! ఒక్క కప్పులోనే ఉంది! అది మీలో ఒక్కళ్ళే తాగారు! (మిగతా అందరూ నోళ్ళు తేలేసి, మనుషులు బిగుసుపోయి కుర్చీల్లో చతికిలపడిపోతారు.) ఆ, ఆ! కంగారుపడకండి! ఆ కప్పులూ ట్రే అన్నీ యిల్లా పట్రా!

జగ : ఎంతపనిచేశావురా, అప్రాచ్యుడ! (పరియత్నం మీద గుటక వేసి) అసలు నీకు విషం ఎక్కడిదిరా?

సుంద : పురుగుల విషం! ఇందాకా రంగయ్యా తెచ్చాడు!

శాంత: అదే! నేను అప్పుడే మొత్తుకున్నాను ఈ డి కుక్క చాలిన విషం ఇప్పుడెందుకండీ! అని. వింటేనా! ప్లానుప్లానంటూ ప్రాణం మీదకి తెచ్చారు!

జగ : (విసుగ్గా) అర్థం పర్థంలేకుండా ఏమిటూ వాగుడు? కాస్సేపు ఊరుకో.

సుంద : రంగయ్యా! ఇల్లా తీసుకురా! (అని చూసి) ఈ కప్పులో అడుగుని తెల్లగా ఉంది ఇదే విషంకప్పు! (అంతా ఆ కప్పుకేసి భయంగా చూస్తారు) ఎవరి కిచ్చావురా ఈకప్పు? (రంగయ్య ఏడుపు మొహ ముతో చూస్తాడు.)

జగ : నీ మొహం ఈడ్చ! మాట్లాడరా!

రంగ : (స్మశాన మొహంతో) గుర్తులేదండీ.

జ్ఞాన : (బాధగా, కోప తో) అంత కళ్ళుమూసుకుని ఎల్లా ఇచ్చావు? ప్రాణమా మరోటా? అసలు నేను రాను మొర్రో అంటూంటే బలవ తాన్న ఇతనే లాక్కొచ్చాడు! ఇప్పుడు!) చేతేమిటి!

విక్ర : అనవసరంగా ఆందోళం గారు పడతారెందుకూ ఆ విషం కాఫీ మీరే తాగారని ఎక్కడు ది? ఏమో, ఎవరిప్రాణం పోతుం దో! భయంకరంగా చూస్తూ) ఏయి రంగయ్యా! ఎవరికిచ్చావు ఆ కాఫీ?

(రంగయ్యావాడలిపోయి క్రేటలో నహా ఒణికిపోతాడు)

శాంత: కప్పులు కూడా బద్దలుకొట్టేస్తావేమిట్రా? ముందవి క్రిందెట్టు! (టీ పాయిమీద పెడతాడు)

విక్ర : (బతిమాలుతున్నట్టు) ఇదిగో! ఆ విషం కప్పు నాకివ్వలేదు కదూ? చెప్పు రంగయ్యా! నువ్వు చాలా మంచివాడవు! నాకివ్వలేదుకదూ!

జ్ఞాన : నీకివ్వలేదు నాయనా! కేవలం నాకు కేటాయించబడ్డ యముడులాగ వాడు! (బాధగా కుళ్ళుతూ) నాకే ఇచ్చాడు! నా ప్రాణం పోతోంది! మందేదేనా చూడండి బాబూ, నా ప్రాణం!

శాంత. ఇల్లా మీనమేషాలు లెక్కడుతూ కూచుంటే నా ప్రాణం కాస్తా పోతుంది, తీరిపోతుంది! డాక్టర్ను వరైనా పిలవండీ.

జగ : ఉండివే! నాకేమిటో ఒళ్లు తిరుగుతున్నట్టుంది! నాయనా, సుందరం! నా ప్రాణం!

సుంద : కంగారుపడకండి నాన్నా! డాక్టర్ని పిలుస్తాను! పురుగుల విషానికి ప్రాణం అంత తొందరగాపోదు

జ్ఞాన : ఏమయితే, పోడం రూఢేగా? ముందు డాక్టర్ని పిలవయ్యా.

సుంద : (కంగారుగా ఫోనుదగ్గర కెళ్ళి, ఫోనుతీస్తాడు.) హలో! 290 ఇవ్వండి. రంగయ్యా! డ్రైవరు ఉన్నాడేమో చూడు! (రంగయ్య వెడతాడు. మళ్ళీ ఫోనులో) హలో! డాక్టరుగారున్నారాండి! ఒహో

మీరేనా ? డాక్టరు గారూ! నేనూ! నేను లాయరు జగన్నాధంగా రబ్బాయిని మా యింట్లో దారుణమైన ప్రమాదం జరిగిందండి ? అర్జంటుగా రావాలి! ఏమిటి ! దోసెలు తింటున్నారూ ? ఇక్కడ ప్రాణాలు పోతున్నాయండీ ! ఎవరికో ఇంకా తెలీదు ! ప్రస్తుతం అంతా ప్రమాదంగానే ఉన్నారు! పొరపాటుని పురుగులవిషంకలిసిన కాఫీ ఎవరో తాగేశారు ! మీరు త్వరగా రావాలి ! కారు పంపి చమంటూరా ! మీ కారు లో నే వస్తాతా ! సరే, త్వరగారండి. (అని ఫోను పెట్టేసి శ్రమపడిపోయినట్టు నిట్టూరుస్తాడు.)

జ్ఞాన : దోసెలేమిటోయి ! (అని ఆశగాచూస్తాడు)

జగ : ఆ, ఖర్మ! ఆ డాక్టరుకి దోసెలంటే తెగఇష్టం. దోసెలు వేసిన్నాడు కేసుల కేసి చూడడు!

జ్ఞాన : అయితే ఇప్పుడు నామాటేమిటి ?

జగ : వాడు నాతో చదువుకున్నాడులెండి! ఇక్కడికంటే అన్నీ వదిలేసి వస్తాడు.

జ్ఞాన : ఏమో ! నాదసలే ముసిలిప్రాణం ! దాన్ని మొహ మాటపెట్టి గెంటుకొస్తున్నాను ఇదిదో, నేనోపాతిక దోసెలు ఇచ్చుకుంటాను. వెంటనేరమ్మని మళ్ళీఫోను చెయ్యి నాయనా !

సుంద : అక్కడ్లేదండి బయలుదేరారు.

[విక్రమరావు ఇటూ అటూ చూసి, ఉన్నట్టుండి శేఖరమూలి అడ్డం పెట్టుకుని ఒళ్ళంతా కుదుపుగుంటూ ఏడుస్తాడు ]

సుంద : అదేమిటండీ మామగారూ! మీరుకూడ ధైర్యం పడితే ఎల్లా?

విక్ర : (అతిబలవంతాన్ని ఏడుపు ఆపుకుంటూ) నాప్రాణం పోతోంది!

సుంద : అదేమిటండీ! డాక్టరుగారు వచ్చేస్తున్నారుగా?

విక్ర : ఏండాక్టరో ఏమిటో! నాప్రాణం పోతోంది! నేను చావడానికి వీల్లేదు! (Hysterical గా) నేను బతకాలి!

శాంత: ఎంతఖర్మ కాలిపోయిందిరా నాయనా! కావలసిన పెళ్ళి కాదంటేమాత్రం ఇంత అఘాయిత్యంరా! విషం తాగెయ్యడానికి సిద్ధపడతావ్రా ఎక్కడైనా? మీ నాన్న గారికి నేను మేనమామ కూతురైనా ఈసంబంధం మా నాన్న కి ఏమీ ఇష్టం ఉండేది కాదు చివరికి వీరేమొండికెత్తి వచ్చి మానాన్నని బతిమాలిసా, "ఛీ అవతలికిపో" మన్నాడు. అయితే మాత్రం, ఆయనేమన్నా ఇలా తొందర పడ్డారా!

జగ : ఏడిశావులే! ఎందుకల్లా అబద్ధమాడుకుంటావు? "ఛీ అవతలికి పొమ్మనలేదు, మీ నాన్న! మళ్ళీ రమ్మన్నాడు!

శాంత: (రోషంతో) ఛస్తూంటే కూడా అబద్ధమాడతా నాండీ! మెత్తగా ఉన్నవాళ్ళని చూస్తే మొత్త బుద్ధిట! ఒక్క పుణ్యక్షేత్రమేనా చూపెట్టారా? నాబతుకంతా వంటింట్లో నే తెల్లారి పోయింది! అసలు నానాలిక పెనేసుకుపోతుంది! ఆడాక్టరింకా రాడేరా, నాయనా!

సుంద: వస్తున్నమ్మా! రంగయ్యా!

రంగ: (L. F. నుంచి వచ్చి) డ్రైవరున్నాడండి!

సుంద: అక్కర్లేదుగాని నువ్వు గేటుదగ్గరనుంచుని డాక్టరు గారు రాగానే లోపలికి తీసుకురా.

రంగ: సిత్త్రం! తొందరగా L. F లోకి వెడతాడు)

జగ: (ఉన్నట్టుండి, వెఱ్ఱిచూపుచూస్తూ) ఇదేమిటండీ ఆ నాయనా, సుందరం! నీ వేళ్ళు చూపెటు!

సుంద: వేళ్ళా?

జగ: (Desperate గా)అవునురా! (సుందరంహడలిపోయి అయిదు వేళ్ళూ చూపిస్తాడు. జగన్నాధం కళ్ళు పెద్దవిచేసుకొని చూసి) అవి మూడేనా!

సుంద: (భయంగా) కాదు నాన్నా! అయితే!

జగ: అయిదా! అయిపోయినది! సుందరం చూపు దిగజారి పోతోందిరా! బతికే మార్గం చూడరా!

సుంద: కంగారు పడకండి, నాన్నా!

విక్ర: విషం కాఫీ నాకిచ్చి ఆయన కంగారుపడతా రెందుకూ? కుర్చీలోంచి లేవగానే త్రిచునా టూ తున్నాడు.

పీడితుమ్ము తగలెయ్యా! ఊపిరి తిన్నగా ఆడటం లేదు. సుందరం! ఉపిరి! నా ప్రాణం!

జ్ఞాన: చాల్లె స్దూ ఎవరేనా వింటే నవ్విపోతారు! తుంటి మీద కొడితే పళ్ళు రాలాయన్నట్టు, విషం కాఫీ నే తాగుతే నువ్వేగ బీలుస్తావేమిటీ? ఖర్మం కాలి పోయి వచ్చా నిక్కడికి. అమ్మ బాబో! నా ప్రాణం పోతోంది! పోతోంది! (అంటూ ఉన్నట్టుండి కళ్ళు మూసేస్తాడు.)

రంగ: (L. F. లోంచి డాక్టరు నంచీ పుచ్చుకుని తొందరగా వచ్చి) డాక్టరుగారొస్తున్నారండి!

[జ్ఞానశ్రీ తప్ప మిగతావాళ్ళంతా ఆనందంతో లేచి నుంచుంటారు డాక్టరు L. F. లోంచి తొందరగా వస్తాడు. వచ్చి వీళ్ళందర్నీ రోగుల్ని చూచినట్టు కళ్లుసన్నం చేసి, డాక్టరు తీవితో పరకిస్తాడు.)

డాక్ట: అప్పుడే ఇనస్పెక్టరుగారు రావడందాకా జరిగిందీ! ఏమిట్రా జగన్నాథం సంగతి.

జగ: ఇంకా ఏం జరగలేదురా! ఇనస్పెక్టరుగారు తాంబూలాలకి వచ్చారు. ఇప్పుడేం చెప్పలేను, ప్రాణం పోతోందిరా! త్వరగా మందెయ్యి!

డాక్ట: ఏదీ, అల్లాకూచో! (అని చెయ్యి పట్టుకోబోతాడు.)

విక్ర: (అడ్డమొచ్చి) డాక్టర్! ఆయన అనవసరంగా [illegible] అసలు విషం కాఫీ నా

కిచ్చారు. ప్రాణం పోతూంట నాకు! ముందు నాకు మందెయ్యండి!

శాంత: డాక్టరుగారూ! అసలు ప్రాణం పోతూంట నాకు ఇంక నిముషాలమీదున్నాను! వెంటనే మందెయ్యా పోతే లాభంలేదు.

డాక్టర్: (కొంచెం విసుగ్గా చూసి) ప్రాణం మాట దేము డెరుగును గాని ముందు మీకందరికీ మతులు పోయిన ట్టున్నాయేమిటి? ఒక్కసారి కూచోండి, చెబు తాను, కూచోండి. (అంతా కూచుంటారు.) సుందరం! వీళ్ళంతా విషం తాగారేమిటోయి?

సుంద: లేదండి! విషం వీళ్ళల్లో ఎవరో ఒక్కరే తాగారు

డాక్ట: మరి అంతా కళ్ళుతేలేస్తున్నారేమిటి? హుఁ అసలు ఏమిటా విషం!

సుంద: పురుగుల విషమండి!

జగ: గమేక్సీను!

డాక్ట: గమేక్సీనుకే ఇంత కథగారు చేస్తున్నార్రా! ఏమాత్రం వెళ్ళిందేమిటి?

సుంద: నాలుగు చెమిచాలండి!

జగ: ప్రాణం పోతూంటే ఈ ప్రశ్నలన్నీ ఏమిట్రా!

డాక్ట: ఏడిసినట్టే ఉంది! నాలుగు చెమిచాల గమేక్సీనుకి ఎలకపిల్లకూడా చావదు. ఏరా జగన్నాథం! ఏను గంత ఉన్నావు. నువ్వా అంత కంగారు పడటా లేమిట్రా!

విక్ర : అయితే ప్రాణం పోదంటారా ?

డాక్ట : ఛ ఎక్కడికీపోదు !

రంగ : పోయినట్టే ఉందండి !

డాక్ట : ఏమిటీ ?

రంగ . (జ్ఞానశ్రీని చూపెట్టి) ప్రాణం !

డాక్ట : అరే ! ఈయన్నిందాకణ్ణుంచీ చూడలేదే !

విక్ర : (కంగారుగా) ముసలిప్రాణం ! పోయిందేమో కూడాను ! చూడండి డాక్టరుగారూ ! ఆయన మా మామగారు ! (డాక్టరు నాడి చూస్తాడు.)

డాక్ట . మీరేం కంగారు పడకండి ! ఆయన పేరేమిటి ?

విక్ర : జ్ఞానశ్రీగారు.

డాక్ట : జ్ఞానశ్రీగారూ ! ఏమండోయి !

జ్ఞాన : (ఉల్లాఉ డే) నేను పోయి అరగంటయిందండి !

డాక్ట : (నమ్మలేనట్టు చూసి) What ! (నాడి బాగా పరీక్షించి) ఇదేమిటయ్యా ! నాడి గోడ గడియారంలా కొట్టుకుంటూంటే ప్రాణం పోయిందంటావేమిటి ?

జ్ఞాన : ఏమిటీ ! నా ప్రాణం పోలే ! (నమ్మనట్టు చూసుకుంటూ) నేను ఇంకా బతికేఉన్నానా ? అయితే నా ప్రాణం, పోతూ పోతూ ఉందిగావును ! మంచెయ్యారూ ! బాబూ ! నా ప్రాణం ! మీ కాళ్ళట్టుకుంటాను.

డాక్ట : మీరు మరీ దారుణం మనిషిలా ఉన్నారేమిటి !— తాతగారూ ! జీవితయాత్ర చాలామట్టుకు సాగిం

చేశారు కదా, మీకూ ఇంత తాపత్రయమయితే ఎల్లా చెప్పండి! ఆ! (అని తేలికగా నవ్వి) ఎందు కేనామంచిది. మీరంతా తలోమాత్రా మింగండి! (అని బేగ్ లోంచి తీసి ఇస్తాడు.)

జ్ఞాన : (చివ కి పుచ్చుకు టూ) ఎం దు కే నా మంచిది నాలుగివ్వండి! అనుమాన రహితం అయిపోతుంది

డాక్ట : అల్లామింగుతే మెదడు మసీదయిపోతుంది! ఒకటి చాల్లెండి!

శాం త డాక్టరుగారూ! మాత్ర ఇచ్చారుగాని, మరోమాటు పరీక్షిస్తే మంచిదేమో.

డాక్ట : ఏమీ అక్కర్లేదమ్మా అల్లా కూచోండి! మీ ప్రాణానికేం భయ లేదు! శాస్త్ర దానికి ఎంత గొడవ చేశారు! ఇల్లాంటప్పుడే కంగారు పడకుండా నిలబడాలి. పానీ శాంతమ్మగారు ఏదో భయపడ్డా రంటే అర్థముంది!

విక్ర చాల్లెద్దురూ, డాక్టరు గా రూ! మీరు మరీ చెభు తారు. కలిసింది గుమేక్సీనా మరోటా!

డాక్ట : గమేక్సీను కనకనే అసలు ఫరవాలేదంటున్నాను. నాకు పదేళ్ళున్నప్పుడు పొట్లం కనిపిస్తే పంచదార అనుకొని అరవీశడు గెమేక్సీను ఊశాను!

జగ : ఏం మనిషివిరా! రుచేనా తెలియలేదురా?

డాౕ : సరే. మనకి రుచి తెలిశాటప్పటికి అంపీశ డయి పోయింది

జ్ఞాన : అబ్బా! అరపీశడే! అయితే అప్పుడు తమరుపోలే! (అంతా నవ్వుతారు)

డాక్ట : తాతగారికి మాత్ర పట్టిచ్చినట్టుంది!

[ఫోను చప్పుడవుతుంది. సుందరం ఫోను తీస్తాడు, డాక్టరు లేచి సిగరెట్ వెలిగించుకుంటాడు,

జగ : కూచోరా రంగయ్యా! డాక్టరుగారికి కాఫీతే.

డాక్ట : కాఫీయా! ఇంక మీ ఇంట్లో తాగను!

శాంత: (లేచి) నేను చేసితీసుగొస్తానుండండి. (R. F లోకి వెడుతుండి)

సుంద (ఫోనులో) హలో! ఎవరు? ఎవరుకావాలండి డాక్టరుగారా? ఉన్నారు.

డాౕ : ఎవరోయి!

సుంద : ఆ, మీకంపోండర్రండి! (ఫోనులో) ఆరే, ఆ కంగా రేమిటండి. మెల్లిగా చెప్పండి! ఏమిటి? మా రంగయ్యా తెచ్చి ది గేమేక్నోనుకాదూ! మైదా పిండా? హరి! మీకెల్లా తెలుసూ! కొట్టువాడు చెప్పాడా! సరే! పంపిస్తున్నాను. (అని ఫోను పెట్టేస్తాడు.)

జగ : ఇంతా చేసి మైదాపిండా?

జ్ఞాన : నేను అప్పుడే అనుకున్నానుస్మీ! ఆ రుచి పురుగుల విషం రుచిలా ఎంతమాత్రంలేదు!

విక్ర : షహే! సరిగ్గా మైదాపిండిలా ఉంది!

డాక్ట : ఇది మాకంపౌండరుకి ఎల్లా తెలిసింది?

సుంద : (తేలిగ్గా) ఆ! మీకు మాకు కొట్టుదగ్గిర పొట్లాలు తారుమారయ్యాయిట మే మడిగిన గెమేక్సిను మీ బట్రోతు పట్టుకుపోయాడు. మీ రడిగిన మైదాపిండి మా రంగయ్య పట్టుకొచ్చాట్ట!

రంగ : కంగారులోను పొరపాటయిపోయి ఉంటుందండి!

జ్ఞాన : పాన్లై రక్షించినవాడు రంగయ్యా!

డాక్ట : (బిగుసుకుపోయి) ఆగండి! మైదాపిండి మీ కొస్తే గెమేక్సీను మాకొచ్చిందా అయితే నే ఇందాకా మైదాపిండనుకొని! (అని ఆగిపోయి భయంగా) దోసెలు! దోసెలు!! (శాంత కాఫీ తెస్తుంది)

జగ : దోసెలేమిట్రా ఈ కాఫీ తాగు.

డాక్ట : వొద్దు! ఇందాకా నేతిన్న దోసెల్లో గెమేక్సీనుంది! చాలాతిన్నాను! గుండెపట్టుకుతోంది! ఒరేయి! ప్రాణం! నా ప్రాణం!!

విక్ర : (గబుక్కుని లేచి) డాక్టరుగారూ! కంగారుపడకండి!

సుంద : ఒహో, ఇప్పుడందుకనా మీకంపౌండరల్లా గోత డుతూ ఫోను చేశాడు!

డాక్ట : అందుకనే ఫోనుచేశాడు! నేను తిని చాలా సేపయింది. ఒరేయి జగన్నాధం! కాళ్ళూ చేతులూ పట్లు తప్పిపోతున్నాయి!

శాంత : మీరూ అల్లా కంగారు పడతారేమిటి, డాక్టరు గారూ !

జ్ఞాన . అబ్బే అల్లా కంగారు పడితే ఎల్లామరి ? అసలు దీనికి ప్రమాద మేమీ లేదన్నారుగా ?

డాక్ట : (విసుగ్గా) లేకపోవడ మేమిట డీ ! విక్షేపంలా ఉంది !

జ్ఞాన : ఉంటేమాత్రం ' సమదుఃఖ సుఖంధీరం సోమృత త్వాయ కల్పతే ! నిదానించాలి నిలబడాలి. మీ దగ్గిర మాత్ర లున్నాయిగా. సీసా చూపెట్టండి. గుప్పెడు తీసుకొచ్చి నోట్లోపడేస్తాను.

డాక్ట : ఊరుకోవయ్యా, గొడవ! ఆమాత్రలేం లాభం లేదు ! నాకు తెలుసుగా ? ఒరేయి జగన్నాథం ! వెంటనే నన్ను గవర్నమెంటు ఆసుపత్రికి చేర య్యాలి. ఆలస్యం చేస్తే మాట దక్కదు. (అని జేబు రుమాలుతో కళ్ళు తుడుచుకొని బాధపడ తాడు.)

విక్ర : చాలు, చాలు ! ఊరుకోండి, డాక్టరుగారూ ! మతి లేకపోతే సరి ! ఈమాత్రం దానికి కళ్ళమ్మట నీ ళ్ళెట్టుగుంటారా ?

సుంద : ఏం భయంలేదు డాక్టరుగారూ ! నేను కారులో - మిమ్మల్ని వెంటనే తీసుగెడతాను. రండి! రంగ య్యా ! డాక్టరుగార్ని పట్టుగో !

డా॥ (లేచి, రంగయ్యని అనుకుని) సుందరం! నువ్వు త్వరగా డ్రైవ్ చెయ్యాలిసుమా! నా ప్రాణం! జగన్నాథం! (అని మాటరాక ఏడుస్తాడు)

జగ : ఏమిట్రాయిది? నీకేం భయంలేదు! మళ్ళీ అర గంటలో క్షేమంగా తిరిగొస్తావు! వెళ్ళిరా! సుందరం త్వరగా తీసుకెళ్ళు!

జ్ఞాన . మనం ఎంత చెబుతే ఏముండీ? అసలు మనిషికి మనోనిగ్రహం ఉండాలి! అదేముఖ్యం! "మాన సంబున మానవు డెందాక వర్తించు నేనిమిదింతలు నందాక నతడు కర్మానుబంధంబుల బోరటు?"

విక్ర : మనోనిగ్రహం దాకా ఎందుకండీ అసలు గుండె నిబ్బరం ఉంటేచాలు!

జగ : నన్నడుగుతే ఏమీ అక్కర్లేదు. ఒక్కవిషయం తెలుసుకుంటే చాలు! ఈ మానవ జీవితాలు కేవలం బుద్బుదాలు!

శాంత : ఏదో సామెత చెప్పినట్టుంది. ఇంతకీ అసలు విషయం శాంబూలాలు!

(అంతా నవ్వుతారు)

(తెర)

—o—

# అంతా ఇంతే!

[14-5-1953వ తేదీని రాజమండ్రి వీరేశలింగం హైస్కూలు పూర్వవిద్యార్థి వార్షికోత్సవ సందర్భంలో ఇది మొదటిసారి ప్రదర్శింపబడినది.

## పాత్రధారులు

సర్వనామం : శ్రీ ద్రోణంరాజు మురళి.
లక్కయ్య : ,, పి బి వీరాచారి.
సుందరం : ,, A L భాస్కరరావు.
లంబోదరం : ,, కొండపల్లి భాస్కరరావు
ప్రవాహం పంతులు: ,, K కిశోర్.

## పాత్రలు

సర్వనామం : పరగణా అంత పట్టుదల, చిన్న మొత్తు బుర్ర కలిగిన ధనికుడు
లక్కయ్య : సర్వనామం ఇంట్లో నౌఖరు.
సుందరం : సర్వనామంకూతురు జానకిని ప్రేమించిన యువకుడు.
లంబోదరం : అతని పెళ్ళికోసం తగనిబాధపడే కాల దోషంపట్టిన వయస్సుగల ధనికుడు.
ప్రవాహంపంతులు: సుందరం తండ్రి, ద్వేషాలు రేగని రోజుల్లో సర్వనామానికి వ్యాపారంలో భాగస్వామి.

# అంతా ఇంతే!

## ( నాటిక )

[తెర తప్పుకోగానే, డబ్బున్నా ఖర్చు పెట్టని యాజమాని ఇంట్లో హాలు గది కనిపిస్తుంది. హాల్లో మధ్యగా నాలుగు కుర్చీలు, ఒక టీపాయి ఉంటాయి. రాకపోకలకి మూడు ద్వారాలు ఉంటాయి. ఇంట్లోకి (R F Right Front) లో ఒకటి, ఇంట్లోకి దారి తీసే ద్వారం (M. B. Middle Back) లో వేరొకటి, వీధిలోకి L. F. Left Front) లో మరొకటి

తెర తప్పుకున్న కొద్ది క్షణాల్లోనే R. F. లో పెంకు సామాన్లు పడిపోతున్నట్టు, గిరవాటెయ్యబడుతున్నట్టు చప్పుళ్లు వినిపిస్తాయి. L F లోంచి లక్ష్మయ్య కంగారుగా వచ్చి, R F కేసి భయంగా చూస్తూ నిలబడిపోతాడు, తాళం చెవుల గుత్తి చేత్తో పుచ్చుకుని, శ్రమపడిపోయినట్లు కనిపిస్తూ, బాధగా చూస్తూ R F లోంచి సర్వజ్ఞానం వస్తాడు సామాన్ల చప్పుడు క్రమేపీ దగ్గిపోతుంది ]

లక్ష్మ : ఏటి, బాబయ్యా! ఇయ్యాల అమ్మాయిగారి డబ్బు మరీ ఎక్కువైనట్టుంది.

సర్వ : (నిట్టూరుస్తూ, కుర్చీలో కూలబడి) ఉన్నట్టుండి గొల్లుమని ఏడుస్తుంది ఊరుకోమంటే పకపకా నవ్వుతుంది. జన్మాంతర ప్రారబ్ధం కాకపోతే నిక్షేపం లాంటి పిల్లకి మతిపోవడ మేమిటి? గదిలో పెట్టి తాళం వేసుకోవలసిన గతి నాకు పట్టడమేమిటి? ఖర్మరా ఖర్మ!

లక్ష్మ : అంతేనండి. బాబయ్యా! కర్మకి బుద్ధి నేదు! అయినా తమకి తెలియందేముందండి ఆ లంబో తరంగారి సంబంధం ఖాయ పరిచి నప్పణ్ణించీ అమ్మాయిగారు ఇల్లా అయిపోయారు.

సర్వ : నీకూ మతిపోతోందేమిట్రా, లక్ష్మయ్యా! లంబోద రానికేరా లక్షలు మూలుగుతున్నాయి!

లక్ష్మ : కాని బాబయ్యా! మనిషి కూడా మూలుగు తున్నట్టే ఉంటాడు!

సర్వ : చాల్లేరా! అందమేమన్నా కొరుక్కు తింటామా ?

లక్ష్మ : కొరుక్కు తినకపోయినా, సూత్తా కూకోడానికేనా వీల్లేదు కదండీ! మనిషి మరీ గేదెజాతి!

సర్వ : ఒరేయి, నువ్వు నోర్మూయి !

లక్ష్మ : సిత్తం! తమకి సెప్పడానికి నేనేపాటి కాని బాబయ్యా! అమ్మాయిగారి బాధ, మీ అవత్త సూత్తాంటే నాగుండె జావయిపోతోంది అమ్మా యిగారు కోరుకున్న ఆసుందరంగారికే ఇచ్చి చేసేత్తే ఈ బాధలన్నీ రాకపోనుకదండీ!

సర్వ : బాధలు బరువవుతున్నాయని పరువుమర్యాదలు వది లేసుకోమంటావురా? ఏమయినా సరే, ఇంకా ఇల్లా ఎన్నిపూళ్ళైనా తిరుగుతాను ఎంతడబ్బైనా ఖర్చుపెడ తాను. కాని, నాకు ద్రోహంచేసిన వాడి కొడుక్కి చస్తే నా పిల్లనివ్వను!

లక్ష్మి : మైళ్ళు, రూపాయలూ ఇల్లాంటి యవ్వారాల్లో సెల్లవండి. పైగా మీాపట్టుదలే సూసుగు టున్నారు గాని అమ్మాయిగారి ఆరోగ్యం ఆలోచిత్తున్నారా

సర్వ : ఎందుకాలోచించటం లేదురా ? (అని శ్వేస్తూ, పైము చూచుకుని) అన్నట్లు పైటమవుతోంది, స్వాములవార్ని తీసుకురావాలి!

లక్ష్మి : సోములారు ఎవరండీ!

సర్వ : ఎవరోగాని, చాలా గొప్ప స్వాములవారు! పొద్దున్నే గుడిదగ్గర దర్శనం చేసుకున్నాను వెళ్ళి నమస్కరించగానే నామనస్సులో ఉన్న బాధంతా చూసినట్టు చెప్పేశారు. నివారణోపాయం ప్రసాదిస్తే గాని వదలనని వెంటనే వారి రెండుకాళ్ళూ పట్టుకూర్చున్నాను.

లక్ష్మి : అబ్బా! అప్పుడేమన్నారు సోములారు!

సర్వ : ఏమంటారు ? నాభక్తి తీవ్రతకి క్రమేపీ లొంగిపోయి, చివరకి మనింటికి వచ్చి అమ్మాయిని పరీక్షించి మంత్రజలం ఇస్తానన్నారు!

లక్ష్మి : ఎంతఅదృష్టమండీ! ఓసారి మామునసలమ్మ !

సర్వ : దానికేంగాని, ఇల్లు జాగ్రత్త! నేవెళ్ళి స్వామివార్ని నిమిషాలమీాద వెంటబెట్టుకు వస్తాను.

లక్ష్మి : సిత్తం! త్వరగా ఎళ్ళిరండి బాబయ్యా!
(సర్వనామం వాడాపుడిగా L F. లోకి వెడతాడు)

లక్క : తలమీద రాత తిన్నగా నేకపోతే నేతులో ఎన్ని లచ్చలుంటే ఏంలాభం! ఉన్న ఊరు వదలేసి పరాయి దేశంలో పడ్డాడు. నిచ్చెపంలాంటి కూతురుకి మతి సెడగొట్టేశాడు పైపెచ్చు "పట్టుదలకీ జై" అంటూ పాతగోడుగుచ్చుకుని పకీరుసాయేబులా తిరుగుతున్నాడు హూ! (అని నిట్టూర్చి M. B. లోకి వెడతాడు మరి. కొంతసేపట్లో L F లోంచి సుందరం మెల్లిగా బెదురుతూ ప్రవేశించి జాగ్రత్తగా పరికిస్తూ హాలుమధ్యకి వచ్చి R. F. కేసి తిరుగుతాడు.)

సుంద : (మెల్లిగా) జానకీ! జానకీ! (లక్కయ్య M B. లోంచి వచ్చి సుందరాన్ని చూసి ఆశ్చర్యంగా ముక్కుమీద వేలేసుకుని సుందరం వెనక్కాలే వచ్చి నుంచుంటాడు) జానకీ! (లక్కయ్య ఉత్సాహంగా సకిలిస్తాడు. సుందరం కంగారుపడి వెనక్కి తిరిగి లక్కయ్యని చూచి) నువ్వా లక్కయ్యా! చంపేశావు కదురా!

లక్క : అదిసరేగాని, సుందరంగారూ! ఈకొత్త ఊళ్ళో అప్పుడే మా మకాం ఎల్లా పట్టుకున్నారు!

సుంద : నీ సహాయం వల్లే?

లక్క : ఏటీ! నాసహాయంవల్లా! ఇల్లా మొదలెట్టకండి బాబయ్యా సర్వనామంగారికి తెలిత్తే నాకూంత

ఉద్యోగానికి ప గనామ సృష్టిస్తారు! పైగా ఆరి పిచ్చికోపం తమకీ తెల్సుగా? ఎముకలు ఇర కొట్టి ఊళ్లో పంచి పెడతారు.

సుంద: ఏమోనుకి! మొన్న నువ్వు కూరల మార్కెట్టులో కనిపిస్తే నీవెచక్కాలే బయల్దేరి ఈ ఇల్లు పట్టు గున్నాను అదిసరేగాని జానకి ఏదీ!

లక్క: (ఆశ్చర్యంగా, బాధగా) అయితే, తమకింకా తెలి యదా, బాబయ్యా!

సుంద: (కంగారుగా) ఏమిటీ?

లక్క: ఈ ఊళ్ళో లంబోదరం అని ఓబుద్ధిలేని లక్షాధికారి ఉన్నాడు.

సుంద: ఉంటే!

లక్క: ఆ లంబోదరానికీ అమ్మాయిగారికీ పెళ్ళి ఖాయం సేసేశారు మన అయ్యగారు!

సుంద: ఊ, చేస్తే!

లక్క: ఇంకేముంటాదండీ! (అని విచారంగా మొహం పెడ తాడు)

సుంద: ఆ' ఏమిటి నువ్వనేది!

లక్క: దాంతో అమ్మాయిగారికి మతిపోయింది!

సుంద: ఏమిటి! జానక్కి మతిపోయిందా!

లక్క: సిత్తం! అత్తమానూ నవ్వూ ఏడుపులూనండి.

సుంద: అంతవరకూ వచ్చిందీ

లక్ష ; సిత్రం! అదేటోగాని వచ్చిన డాక్టర్లు వచ్చినట్టే
చక్కాపోతున్నారండి!

సు ద : (బాధగా) ఎంతపని చేశారు, లక్షయ్యా!

లక్ష . (తెల్లబోయి) అదేటి, బాబయ్యా!

సు ద ; అది అంతే, లక్షయ్యా! నాకు తెలుసు! ఈ పరి
స్థితికి వచ్చాక ఇంక ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు!

లక్ష ; (భయంగా) నిజమే! అంతమాట అనకండి,
బాబయ్యా!

సు ద : చేసిందంతా చేసి ఇప్పుడెందుకీ దొంగ ఆరాటం

లక్ష ; నేనేం చేశాను, బాబయ్యా!

సుంద ; ఇంకా ఏంచెయ్యాలి? మూర్ఖత్వంతో ముందు
వెనుకలు ఆలోచించకుండా ఆసర్వనామం కన్న
కూతురుకే ఉరితాడు తయారు చేస్తున్నావు.
నమ్మినబంటువి గనక పాపమనేనా ఆలోచించ
కుండా మాఇద్దరికి ఎడబాటు తెచ్చి, చివరికి జానకి
ప్రాణాలుకూడా తియ్యడానికి నువ్వు సిద్ధపడు
తున్నావు! (లక్షయ్య బాధపడిపోతూ లేదన్నట్టు
చేతులు ఊపుతాడు.) కానీ! జానకి ప్రాణంతో
పాటు నా ప్రాణంకూడా బలితీసుగుని వర్థిల్లండి!

లక్ష : (శోకగా వచ్చి ఆపి) సుందరంగారూ! నే వంత
పాపిష్టోణ్ణికాదండి! కాని, నన్నేంసెయ్యమంటారూ
సెప్పండి!

నిజ గా నీకు జానకి బతకాలని ఉందా ?
ఉండడమేటి బాబయ్యా ! ఆ తల్లికోసం ఏంచెయ్యా
మన్నా సేత్తాను. దారితోచక సత్తున్నాను అంతే !
దారి నేచూపిస్తాను !
సెప్పండి !
వెనక్కి తిరిగిపోతే !
పీక తెగెయ్యండి ! (సు ం ద ర ం అనుమానంగా
చూస్తాడు) ఇంకా అనుమానమేటండీ ? దేముడు
మీద ఒట్టు సరేనా !
అయితే జానకి ఏది
(R- F- కేసి చూపెట్టి) ఆ గదిలో ఉన్నారండి !
నడు !
గదికి తాళం ఉందండి !
తాళంచెవు లేవి
అయ్యగారు పట్టుకుపోయారండి !
(విసుగ్గా) ఇదా నువ్వుచేసేసాయం మాకు ?
తా ళ ం చె వు లు ఆయనట్టుగుపోతే నేనేం సెయ్యా
నండీ ?
అయితే మంచిరాయి టి రాయి ఓటిపట్రా !
ఎందుకండీ ?
తాళం బద్దలుకొట్టాలి కదురా, కళ్యాణస్వామి !
త్వరగా (వెళ్ళు. లక్కయ్య M B లో వెడకి

తాడు. సుందరం R F.లోకి వెడతాడు. లక్కయ్య
\! B లోంచివచ్చి బుర్రగోక్కుని ఆలోచించిL F
లోకి పరిగెడతాడు. సుందరం నిట్టూరుస్తూ R F
లోంచి వస్తాడు) సమయం, సందర్భం తెలియదు
ఈఆడవాళ్ళకి! లేచిపోతం! పరువుతక్కువట
పైగా తండ్రికి గుండెజబ్బుట! ఈ సర్వనామాన్ని
ఒప్పించడం నాతరమా (అంటూ కుర్చీలో కూల
బడతాడు. పెద్దసైజురాయి పుచ్చుకుని L F.లోంచి
ఉత్సాహంగా లక్కయ్య వస్తాడు.)

లక్క : ఇదిగోనండి, రాయి!

సుంద : నెత్తిమీదపెట్టుకుని ఊరేగు

లక్క : అదేటండి! తాళం బద్దలుకొడతానన్నారుగా?

సుంద తాళంకాదురా బద్దలుకొట్టవలసింది. సర్వనామం మూర్ఖత్వం! లక్కయ్యా! ఈ సర్వనామానికి గుండెజబ్బుందా?

లక్క : మెల్లిగా అంటారేటండి! ఎప్పుడో పోవాల్సిన ప్రాణం. అసలు పోడానికి ఓపికలేక అలా నిలబడి పోయింది!

సుంద : ఖర్మ! సర్వనామం ఎక్కడికెళ్ళాడు?

లక్క : గుడిదగ్గర ఎవరో సోమలారున్నార్ట!

సుంద : (హడలిలేచిపోయినట్టులేచి) ఏమిటీ?

లక్క : ఆరిని తీసుకురావడానికెళ్ళారు.

సుంద : (తలకొట్టుగుంటూ) కొంపముంచేశావు శాలక్కయ్యా

లక్క : (ఆదుర్రాగా) ఏమండి సుందరంగారూ !

సుంద : (నిట్టూర్చి) నేనే ఆ స్వాములవార్ని !

లక్క : (తెల్లబోయి) ఏమిటీ? నిజమే !

సుంద : ఏం చెయ్యమంటావు. మరి' దానికిని ఎల్లానైనా కలుసుగుని నచ్చజెప్పి ధైర్యం ఇవ్వకపోతే దక్కదేమో నని భయతో ఏదారీ తోచక ఈ స్వామివేషం కట్టాను.

లక్క : అయితే అయ్యగారు మీ కోసమే ఎళ్ళారు !

సుంద. ఇప్పుడెల్లా ? వేషమేసుగుని గుడిదగ్గరికి పరిగెత్తి డానికి టైమేదీ సర్వనామం నెళ్ళి చాలా నేను చూడు ! అని R- F. లోకి తొందరగా వెడతాడు. లక్కయ్యా! అసలాయన వచ్చేస్తాన్నాడేమో చూడు! (ని R. F లోకి తొందరగా వెడతాడు. లక్కయ్య L. F లోకి వెళ్ళిపోతాడు. ఒక్క క్షణం ఆగి మళ్ళీ ఇద్దరూ వచ్చేస్తారు) ఏం లక్కయ్యా '

లక్క : ఇక రాటం నేదండి! తమర్ని అమ్మాయిగారు ఆనమాలు కట్టారండీ

సుంద · (బాధనటిస్తూ) లేదు' బొమ్మలా చూస్తోంది. అంతే; (నిట్టూర్చి) నేను వేషమేసుగుని గుడిదగ్గిరికి వెళ్ళిపోతాను

లక్క ; వేప మెక్కడుంపండి ?

సుంద ఈ పక్క మేడ నే !

లక్క ; ఏటీ, సుబ్బయ్యగారి మేడలోనా !

సుంద ; అవును! వీధిగది! సాయంత్రం తప్పకుండారా ! పనుంది !

[అని సుందరం తొందరగా L F దాకా వెళ్ళి కంగారుగా వెన క్కొచ్చేస్తాడు ]

లక్క : అయ్యగారే (సుందరం వినిపించుగోకుండా M. B లోకి వెళ్ళిపోతాడు L F లోంచి లంబోదరం కులా సాగా వసాడు బాధగా) సచ్చిందిరో, గొట్టి !

లంబో ; ఏమిటీ లక్కయ్యా ! పలవరిస్తున్నావు ।

లక్క : తమరా, బాబయ్యా ! దయసేయండి !

లంబో : ఊ! మామగారేరీ ?

లక్క : వీధులో కెళ్ళారండి !

లంబో ఎక్కడికి చెప్మా !

లక్క : గుడిసగ్గిరికి గొప్పసోములారు ఎవరో వచ్చారంటగా ? ఆరిని తీసుగొద్దామని ఎళ్ళారండి !

లంబో : సోములారెందుకూ ।

లక్క : అమ్మాయిగారికి మందిప్పించడాని కండి !

లంబో : అల్లానా ! (ఆనందంగా) అయితే ఆస్వాములవారు ఇప్పుడిక్కడికి వస్తారా !

లక్క : (బాధగా) సిత్తం !

లంబో: కావు ది! ఆ కుర్చీలో కూచుంటాడు. సుందరం M·B లోను చుని లక్ష్మయ్యకేసిచూస్తూ తలకొట్టు కుంటాడు తను వెళ్ళాలి అన్నట్టు సంజ్ఞ చేస్తాడు సుందరం)

లక్ష్మ : ఆ! లంబోదరంగారూ!

లంబో: (తాపీగా) ఏరా!

లక్ష్మి : అయ్యగారెళ్ళి సానా సేపయింది. ఇప్పటిదాకా రానేదు. పోనీ తమరుకూడా ఓ నారి గుడిదగ్గ కి వెళ్ళి రాకూడదండీ!

లంబో: ఒరేయ్, నీచాదస్తంగాని, సర్వనామం అంత పెద్ద మనిషి వెళ్లాక. డాక్టర్ లంబోదరం నిమ్మపళ్ళ రోడ్డు అనే మరో పెద్దమనిషి మళ్ళీ స్వయంగా వెళ్ళాలా? అక్కర్లేదు! స్వాములవారు తప్ప కుండా వస్తారు. జానకికి తప్పకుండా నయమవు తుంది. మనకి తప్పకుండా పెళ్ళవుతుంది!

లక్ష్మ : (చిరుకోపంతో) ఇక తమకి పెళ్ళవటం ఖాయమే నండి!

లంబో; మరేమిటనుకున్నావు? డాక్టర్ లంబోదరం నిమ్మపళ్ళరోడ్డు అంటే తిరుగులేదు!

(అని మలుకుతూ కూచుంటాడు, లక్ష్మయ్య కంగారు పడుతున్న సుందరానికి లాభంలేదన్నట్టు సంజ్ఞచేస్తాడు, సుందరం నిట్టూర్చి వేలు వొంచి తాళం చెవితీసి లక్ష్మయ్యకి చూపెట్టి తాళం తీసి సన్యాసివేషం

తెచ్చిపెట్టమన్నట్టు సంజ్ఞచేస్తాడు. లక్కయ్య తప్పాపి గులుపుతున్నట్టు కుర్చీలమీద తువాల్లు విసురుతూ M B. కేసి నడుస్తాడు.)

లంబో: అన్నట్టు లక్కయ్యా! ఇల్లారా,

[సుందరం M B లోకి తప్పుకుంటాడు లక్కయ్య విసురుగా లంబోదరం దగ్గిరికి వస్తాడు.

లక్క: ఎందుకండి!

లంబో: (సంతోషంతో లేచి) ఒరేయి జానకి! ఆయ్? జానకి ఏంచేస్తోంది

లక్క: సూడనేదండి!

లంబో. ఈవాళ డబ్బాలు అవీ ఏం చప్పుడవటం లేదే, లోపల?

లక్క: అవునండి!

లంబో: అయితే లక్కయ్యా! గబుక్కుని వెళ్ళి తాళం చెవి పట్టా! ఇద్దరం వెళ్ళి చూసొద్దాం!

లక్క: అయితే తాళం చెవి తీసుగొస్తానుండండి! (అని మొండిగా M B లోకి వెళ్ళి ఒకక్షణం ఆగి వస్తాడు అన్నట్టు తాళంచెవులు అయ్యగారు పట్టి గెళ్ళారండి!

లంబో: ఇదేం రోగంరా మీ అయ్యగారికి! జబ్బు తక్కువయినప్పుడు తాళమేస్తాడు. ఎక్కువయినప్పుడు మీద కొదిలేస్తాడు. మొన్న చూశావా! తగ్గింది, తగ్గిందిలాంటే లోపలకెళ్ళాను. వెంటనేడబ్బాపుచ్చుకుని చచ్చేలాకొట్టింది! ఏమయినానరే! పూర్తిగా

తగ్గితేగాని ఛస్తే పెళ్ళి చేసుగోను. (అని విసురుగా కూచుంటాడు.)

అక్క: సిత్రం! (అని కంగారుగా L. F కేసి నడుస్తాడు.)

లంబో నువ్వెక్కడి కెడుతున్నావు!

అక్క: అర్జంటుపని గాపకంవచ్చి ది. సిటికలో వచ్చేస్తా నండి! (అని వెనక్కి చూడకుండా L. F. లోకి వెళ్ళిపోతాడు.)

[లంబోదరం అక్కయ్య వెళ్ళిన కొద్దిక్షణాల్లో లేచి L F కేసి నడిచి వెంక్కి వచ్చి M Bకి ఎదురుగా కుర్చీలో కూచుని ఏదో ఆలోచన చేసినట్లు సంతోషంతో చూస్తూ,

లంబో అసలు పిల్లమతాబాలా ఉన్నప్పుడు మళ్ళీ మతి గూడా ఎందుకూ, తోకచుక్కలాగ! మతి ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది. కాస్తా తిరిగ బడకుండాఉంటే సరి! ( R. F. కేసి చూసి, ఆప్యాయంగా) మేడగదిలోపల వాతావరణం ఆహ్వానిస్తు న్నట్టు తెగ ప్రశాంతంగా ఉంది. తాళమోటి తగ లేసి ఈసర్వనామం మాఇద్దరికీ ఎడబాటు కలిగిం చాడు కదా! ఇతగాడికి పుట్టగతులుంటాయి? ప్చ్! పాపం! డొక్కా లంబోదరం, నిమ్మపళ్ళ రోడ్డు అని తెగ స్మరిస్తూ ఒక్కర్తే కూచునుం టుంది. నేను ఎటునుంచి వస్తున్నానా అని కళ్ళు

కాయలు కాచేలా చూస్తూ ఉంటుంది! (ఆవేశంతో లేచి) వెంటనే కలుసుకుంటాను, ఆ! దొడ్డి వైపు వెళ్ళి, నిచ్చెన వేసుకుని మేడ ఎక్కేస్తాను (అని R F కేసి తిరుగుతాడు. సుందరం హాయిగా నిట్టూర్చి M B లోకి వస్తాడు, లంబోదర ఆగి అమ్మ బాబోయ్! అంటూ వెనక్కి పరుగెత్తుకొచ్చి L F ఇవతల కుర్చీలో కూచుంటాడు. సుందరం తలకొట్టుకుంటాడు) తీరా పైదాకా రానిచ్చి కిందికి ఒక్కతోపు తోసిందంటే నడుం షికారెడుతుంది. ఈ మతి విసురుకి వాటం పట్టుకోడం మా చెడ్డ కష్టంగా ఉంది. కాని మనిషి మామూలుగా ఉన్నప్పుడు నవ్వుతూంటే, ప్రాణం జార్లబడిపోతుంది! జానకి! (అని ప్రేమతో పిలుస్తూ, హాయిగా వెనక్కి జార్లబడుతూంటే వెనకాల లేవచ్చి నిలబడ్డ సుందరం ఇంక కోపం పట్టలేక వీపుమీద ఒక్కటి కొట్టి ఆవేశంతో అక్కడే నిలబడిపోతాడు. లంబోదరం అల్లాగే చలనం లేకుండా బిసుకుగుపోయి, కళ్ళు పెద్దవి చేసుకుని భయంగా) నా వెనకాల ఎవరో ఉన్నారు! (అది విని సుందరం కంగారుగా M B లోకి పరిగెడతాడు, తర్వాత ఉన్నట్టుండి గబుక్కుని లేచి లంబోదరం కుర్చీ వెనకాల కిందా గబగబా వెతికేస్తాడు.) — చిత్రంగా ఉందే! వేపు

మీద మణుగు దెబ్బ పడకుండా ఘాయం మనిషి కనపడడు, ఏమిన్యాయం! ఒక వేళ మనిషి కాదేమో! (గుటకేసి భయంగా) దెయ్యం! (పిచ్చిగా) దెయ్యం! (అని అరచి L F కేసి తిరిగి) లక్కయ్యోయి!

లక్క: (చిన్న పెట్టె పుచ్చుకుని (L F లోంచి వచ్చి లంబోదరంగారు! లంబోదరంగారూ! ఏమిటి సంగతి?

లంబో: దెయ్యాలు! (అంటూ లక్కయ్యని L F లోకి తోసుకుని చక్కాపోవడానికి ప్రయత్నిస్తాడు)

లక్క: అబ్బ! ఉండండీ! ముందు పెట్టెలోపల పెట్టాలి!

లంబో నేపెడతానుగాని, నువ్వక్కడే నుంచో చెప్తాను!

[అని పెట్టె తీసుకుని కంగారుగా వెళ్ళి M B కి దగ్గిరగా ఉన్న కుర్చీలో పడేసి వెంటనే వచ్చేస్తాడు!

లక్క: అసలు ఏమయిందండి! (M. B లోంచి సుందరం వచ్చి గబుక్కుని ఆ పెట్టె తీసుకుని M. B లోకి వెళ్ళిపోతాడు,)

లంబో: ఏమనడమేమిట్రా! సమయానికి నువ్వొచ్చావు గాని లేకపోతే ఈపాటికి డొక్క లంబోదరం, నిమ్మపళ్ళ రోడ్డు ఉండదు! (అని ఏడుపు మొహంతో చూస్తాడు.)

లక్క: ఏమిటీ!

లంబో. ఆ! మరణాం తలవెంట్రుక వాసిలో తప్పిపోయిందనుకో!

లక్ష్మ : ఆ, మీాకు మరీభయం!

లంబో: నీమొహం! నేను ఆ మాత్రం నిదానించకుండా భయపడతా ననుకున్నావా? జరిగి ది జాగ్రత్తగా విను! నేనా కుర్చీలో కూచున్నాను! ఇంతలో (అని M B దగ్గర కుర్చీకేసి చూసి చూపెట్టబోయి తెల్లబోయి, బిగుసుకు పోతాడు)

లక్ష్మ : ఇంతలో!

లంబో: (గుటకేసి వెనక్కు జరిగి) పెట్టి! లక్ష్మీ! ఆ పెట్టి!

లక్ష్మ : ఏ పెట్టండీ?

లంబో: ఇంకా ఏ పెట్టేమిట్రా? ఇదీ ఆ దెయ్యపనే! సందేహంలేదు! ఈ కొంప తా దెయ్యాలపుట్ట! ఒరేయి, నువ్వుమాత్రం దూరంగా వెళ్ళకు! (గ్రహించినట్లు కళ్ళెగరేస్తూ) అంతే! హు! డాక్టర్ లంబోదరం. నిమ్మపళ్ళరోడ్డు అంటే ఆవలిస్తే పేగులు లెక్కేట్టేస్తాడు!

లక్ష్మ : ఏమిటా పేగులు?

లంబో: కళ్ళెగరేసి, గర్వంగా) జానకికి మతి పోలేదు!

లక్ష్మ : (తెల్లబోయి) ఆ!

లంబో: ఆ! చాలా సర్వీసు ఉన్న దెయ్యం పట్టింది!

లక్ష : అదా! ఏమయితే ఏమండీ! సోములారు వత్తున్నారుగా అన్నీ కుదిరిపోతాయి.

లంబో: మరి ఆయనకి దెయ్యాల పరిచయం ఉందా!

లక్ష : పరిచయ మేమిటండీ దెయ్యాల్ని ఆయనగోరు సర్కస్ ఆడించేత్తారంట!

లంబో: అబ్బా!

లక్ష : హు! అసలు అయ్యగారు ఏంచెప్పారో తెలుసా!

లంబో: ఏం చెప్పారు

లక్ష : సోములారు చెయ్యెత్తితే నీళ్ళట! చెయ్యిమూత్తే మంటలూట!

లంబో: (తెల్లబోయి. నిలబడిపోయి. భయంగా గుటకేసి) ఏమిటీ (ఆలోచించి) లక్ష య్యా! నిన్న కొంత అరిటిపళ్ళగెల పట్టగొచ్చి ఇచ్చానుగదా, పళ్ళేమైనా మిగిలాయా

లక్ష : ఉన్నాయండి, భోంచేత్తారా?

లంబో: నీ మొహం! - అది కాదురా! సోములారు రాగానే ఓ అత్తంఅరిటిపళ్ళు చేతిలోపెడితే మనకేసి శాంతముచిగా చూస్తారు.

లక్ష : (ఉత్సాహంగా) భలే! అప్పుడు మీా పెళ్ళయిపోతుంది! ఓసారి మా ముసలమ్మ!

లంబో: దిక్కుమాలిన ముసలమ్మ! నువ్వు ముందెళ్ళి తీసుగురా!

లక్క : (వినయంగా) ముసలమ్మ రాదండి !
లంబో : ముసలమ్మ కాదురా, శనీ అరిటిపళ్ళు
లక్క : సిత్తం ! (అని R F. కేసి నడుస్తాడు. లంబోదరం ఉత్సాహంగా ఇటూ అటూ చూసి ఒక్కడూ ఉండడానికి భయమేసినట్టు R F కేసి తనూ నడుస్తాడు.)
లంబో : లక్కయ్యా ?
లక్క : ఏమండి !
లంబో : నేనూ వస్తాను, నడు !
లక్క : ఏం ! తమరొక్కరూ కూకోడానికి భయమా ?
లంబో : (హేళనగా) భయమా ? ఛెస్ ! డొక్కా లంబోదరం, నిమ్మపళ్ళరోడ్డు జాతకంలో లేదు భయమనే మాట !
లక్క : సిత్తం ! (L F కేసి చూసి) ఆ ! ఆ కుర్చీ కిందల్లోం డేటండి !
లంబో : (భయంగా, వెనక్కి చూడకుండా) ముందు నువ్వు లోపలికి నడవరా, నీ మొహం ఈడ్చ ! (అని లక్కయ్యని అల్లాగే వెనక్కి తోసుకుంటూ R.F లోకి వెళ్ళిపోతాడు. ఒక క్షణం ఆగి ఇద్దరూ మళ్ళీ R F లోంచి వస్తారు. చేతులో అరిటిపళ్ళు లక్కయ్య బల్లమీద పెడతాడు. లంబోదరం గబా గబా ఆలోచించి) విసినికర్ర ! విసినికర్ర ! నడు !

(అంటూ లక్ష్మయ్యతో మళ్ళీ R F లోకి వెళ్ళి పోతాడు.)

[M B లోంచి సుందరం, స్వాముల వారి వేషంలో వచ్చి ఉత్సాహంగా ఇటూ అటూ చూసి ఒక కుర్చీ గదికి మధ్యగా లాక్కుని కుర్చీలో ఆసనం వేసుకుని కూర్చుని, కమండలానికి ఓపక్క ఆనకుని, కళ్లుమూసుకుని, రుద్రాక్షమాల తిప్పుతూంటాడు. లంబోదరం విపరీతశ్రద్ధ ప్రచ్చుసుని పోయిగా నవ్వుతూ వచ్చి సుందరాన్ని చూసి నవ్వు ఆపేసి తెల్లబోతాడు లక్ష్మయ్యకూడా వచ్చి ఆశ్చర్యంగా చూస్తాడు. లంబోదరం సైలెన్స్ గా నిలుచుంటాడు ]

లక్ష్మ : ఓనారి మా మాసలమ్మ !

లంబో : నోరుముయ్యారా ! (మెల్లిగా) లక్ష్మయ్యా ! ఆ కుర్చీలో ఏమిటి ?

లక్ష్మ : సోములారే !

లంబో : ఆ !

లక్ష్మ : ఇంకా సందేహం ఏమిటండీ (మెచ్చుకుంటూ) ఆహా ! ఏం తేజస్సు !

లంబో (ఏడుపు మొహంతో) పీథి తలుపు గడియవేసుంది!

లక్ష్మ : అయితే !

లంబో : (విసుగ్గా మెల్లిగా) నీదింత చవుడు తలకాయేరా ! ఈయన లోపలికి ఎల్లావచ్చారూ !

లక్ష్మ : (గుడ్లప్పగించే లంబోదరం కేసి చూస్తూ నిలబడి పోతాడు.)

లంబో : (ఆదుర్దాగా) మామగారేరీ !

లక్క : (భయంగా చూస్తాడు.)

లంబో : (హడిలిపోయి గబగబా విసురుకుంటూ) మాట్లాడవేరా !

లక్క : మీరింత అర్థ లేకుండా కంగారు పడతారేమిటండి ? ఆరు గొప్పశక్తిగల సోములారు ! మామిడిసెక్క గడియలూ, ఒంటెత్తిటికి గోడలూ ఆరికి ఓ అడ్డంటండీ మన అదృష్టం బాగుండి ఇక్కడే దర్శనమిచ్చారు !

లంబో : అవునసుకో ! నా అనుమానం ఏమిటంటే ఈసరుకు కూడా దెయ్యం భాగతేమోనని !

లక్క : అబ్బ, ఊరుకోండి రండి ! దణ్ణం పెడదాం !

[లంబోదరం బల్లదగ్గిరికి వెళ్ళి అరటిపల్లు తీసుకుని లక్కయ్య వెనకాలే నడుస్తూ సుందరం దగ్గిరికి వెడతాడు.

లంబో : మహాప్రభూ! కటాక్షించాలి!

[అని కుర్చీదగ్గరగా లక్కయ్య మోకరించి, లంబోదరాన్ని కూడా అల్లాగే చెయ్యమని సంజ్ఞ చేస్తాడు. లంబోదరం అరటిపల్లు పక్కకి పెట్టేసి ఊదేసి, సాష్టాంగా తాపీగా మోకరించి తలవంచుకుని సుందరానికి నమస్కరిస్తాడు. సుందరం ఓకంటితో లంబోదరాన్ని చూసి, కమండలంతో లంబోదరం తలకాయ మీద కొట్టి యథాప్రకారం కూచుంటాడు ]

లంబో : (ఉలిక్కి పడి, బుర్ర రాసుగుంటూ లేచి) అమ్మోయ్ ! బుర్ర చిల్లడిపోయింది. లక్కయ్యోయ్ ! కొడుతున్నాడు కూడా ఏమిట్రా ఈయన ! అమ్మ ! అమ్మ! తలతిమ్మిరెక్కిపోయింది !

లక్క: అబ్బ, ఊరుకోండి! ఈయనలో పెద్దశక్తి ఉంది, మనల్ని కనిపెడుతూ నేఉంటారు జాగ్రత్త! శపించారంటే రాళ్ళయిపోతాం!

లంబో: (భయ గా) రాళ్లే!

లక్క: ఆ! ఉత్తనాపరాళ్ళు!

లంబో: (స్మశాన మొహంతో) నేను ఇంటికి పోతాను!

లక్క: మీరుండండి, నేను చెబుతాను! (నకిలించి) స్వామీ! ఈపావుల్ని కటాక్షించాలి!

సుంద: (మెల్లగా కళ్ళు తెరచి, గంభీరంగా) ఎవరది!

లంబో: (ఒణుకుతూ) ఎవ్వరూ లేరండి!

లక్క: మేమేనండి! మేం మంచి కష్టంలో ఉన్నామండి! తమరేం రచ్చించాలి. (సుందరం తల ఊపుతాడు.) ఆరు డొక్కా లంబోదరం, నిమ్మపళ్ళ రోడ్డుగారు!

సుంద; అదేమిటి?

లంబో: (బిక్క మొహంతో) అది నాపూర్తి ఎడ్రసండి!

సుంద: (లంబోదరం నమస్కారం గుర్తించి) శీఘ్రమే కల్యాణ ప్రాప్తిరస్తు!

లంబో: (కొంచెం హుషారుగా) అవునాండి, మరి! అందుకోసమే తమర్ని ప్రార్థిస్తున్నామండి.

సుంద: ఎందుకోసం?

లంబో: అదేనండి! కల్యాణం!

సుంద: మంచిది!

లంబో: నాభార్యకి! అహా, కాదండి! నాకాబోయే భార్యకి అదీ కాదండి! ముందీఇంట్లో పెద్దదెయ్యంఉంది!

సుంద; లేదు!

లంబో. మరిదానికి మతిపోయిందే! ఇందాకా పెట్టేసిందిపెగ్గా వీపుమీద చాటంత దెబ్బ!

సుంద; (చిరుకోపంతో) అనవసర ప్రసంగం!

లంబో; చిత్రం! ఏమైనా జానకి మతిపోవటం ఖాయమండి తమరే రక్షించాలి?

సుంద; అందుకోసమేగా వచ్చాం?

లంబో; చిత్తం, చిత్తం! స్వాములు నిన్న ఏకాదశి ఉపోష్యం అనుకుంటాను. ముందు నాలుగు బొంత అరటి పళ్ళు సేవించండి!

సుంద; ఛీ! అవతల పారెయ్యి!

లంబో: (హడలిపోయి వదిలేసి) చిత్తం, పారేశానండి! కాని, స్వామీ! జానకికి మతికుదరపాతే తమరేమడిగితే అది ఇచ్చుకుంటానండి!

సుంద; మాట తప్పితే:

లంబో; ఏమిటి! డొక్కా లంబోదరం, నిమ్మపళ్ళరోడ్డు—మాట తప్పడమా? హు! తప్పితే పళ్ళూడగొట్టండి!

సుంద: మొహం దగ్గరసా పెట్టు!

లంబో (బిక్క మొహంతో) ఆ! ముందరే ఊడగొడ తారా! (అని కళ్ళు మూసుగుని దగ్గరగా జరుగు తాడు)

సర్వ : (L F లోంచి వస్తూనే సుందరాన్ని చూసి ఆశ్చ ర్యంగా నమస్కరిస్తూ) తమ రిక్కడికే దయ చేశారా, స్వామీ ?

సుంద : (నీరసంగా నవ్వి) హూ! ఊ, ఊ- భక్తుల బాధలు మాకాళ్ళకి పెట్టని గొలుసులు!

సర్వ : చిత్తం! నిజంగా మేం ఎంత అదృష్టవంతులం!

లంబో : సరిగ్గా నేనూ అముక్కే అన్నానండి, మామగారూ!

సర్వ : సరేగాని, లంబోదరం! ఆ విసినికఱ్ఱ తీసుగుని స్వామివారికి విసురూ!

లంబో : చిత్తం? (విసినికఱ్ఱ తెచ్చి విసురుతాడు.)

సర్వ : అన్నట్టు, తమకి మాఇల్లు ఎల్లా తెలిసింది, స్వామీ!

లంబో : మామగారికి ఏమీ తెలియదు! స్వాములకి దివ్య దృష్టి ఉండదండి, మరీ!

సర్వ : ఎంత ఆశ్చర్యం!

లక్క : మరేనండి! ఓసారి మాముసలమ్మ!

సుంద : అనవసర ప్రపంగం! సర్వనామం! రోగి ఏది!

సర్వ : లోపలుందండి!

సుంద : తీసుకురా. ఇక్కడికి!

పర్వ : చిత్తం! లంబోదరం! ఇదుగో తాళంచెవి! (అని తాళంగుత్తి తీసి, తాళంచెవి వేరే పట్టుగునిఇస్తాడు)

లంబో : (పుచ్చుగుని, చూసి) అవునండి! (అని మళ్ళీ ఇచ్చెయ్యబోతాడు.)

పర్వ : నీ మొహంలా ఉంది! మేడమీదకి వెళ్ళి అమ్మాయిని తీసుకురావోయి!

లంబో : (బిక్కమొహంతో) నేనెందుకండీ? వ్యాం! వ్యాం! తమరే!

పర్వ : ఫరవాలేదు వెళ్ళు! స్వామివారుండగా నీకేం భయం!

లంబో : (ధైర్యం లాక్కు తెచ్చుగుని) అవును! (నవ్వుతూ) హిహిహి? ఏరా, లక్కయ్యా! మనకి భయం లేదుగా!

లక్క : (హుషారుగా) లేదు కదండీ!

[లంబోదరం ధైర్యంగా అడుగులేసుకుంటూ R.F లోకి వెడతాడు గొద్దిక్షణాల్లో ఆవేపునుంచి చప్పుళ్ళు, కేకలు గట్టిగా వినిపిస్తాయి, లంబోదరం కంగారుగా R F లోంచి పరుగెత్తుకొస్తాడు జుట్టు రేగిపోయి ఉంటుంది, ఓ కన్ను కప్పంగా అవుతుంది వాపోతున్నట్టుంటాడు ]

పర్వ : అల్లా అయిపోయావేమిటి? కన్ను అల్లా వాచిందే!

లంబో : (ఏడవబోతూ) నే వెళ్ళేనంతే లోపలికి తోశారు! ఒకత్తే పట్టుగుని చచ్చేలా కొట్టింది... నేనుగనక!

ధైర్యంగా వెనకొచ్చేశాను. అబ్బ! అబ్బ! దడ దడ ఇంకా ఇప్పటికి తగ్గలేదు!

లక్క— తమరేదో అనుకుంటారు, నే కపోతే అంతమంచి అమ్మాయిగారికి అంతనాపుకోపం ఎందుకొత్తుంది

లంబో: నీతలకాయి! నేనసలుమాటే ఆడందే! మామ గారిచ్చిన తాళంచెవితో మెల్లిగా తలుపుతీసి జాగ్ర త్తగా తొంగిచూశాను! అంతే! (ఏడుపు ఆపు కుంటూ) తలకాయ ధనేల్ మని పోయి ది! (తల మీద చేతులేసుకుని) అబ్బ!

సర్వ: అంతా మనకర్మ! ఈసారి గుమ్మంలో సుంచుని కేకేయి!

లంబో: (నిక్కచ్చిగా) ఇంక నన్ను తోసినా వెళ్ళను!

సర్వ. వెళ్ళమంటూంటే ఏమిటా మూర్ఖత్వం (కోపంగా చూస్తాడు.)

లంబో: (అనుమానిస్తూ) సరేనండి! R. F దాకా వెళ్ళి భయంగా చూస్తూ) జానకీ! అదిగో మెట్లమీద కొచ్చింది! (వెనక్కితగ్గి) జానకీ! నేను కాదు మీనాన్నగారు పిలుస్తున్నారు. (ఓ తలగడా విసు రుగా వచ్చి లంబోదరాన్ని డీకొంటుంది) హాబ్బ! మీ నాన్న పిలుస్తుంటే నన్ను కొడతావేమిటి మరి. మరి! అసలు నువ్వు అల్లా అల్లరిచెయ్యొచ్చా.

చెప్పు! నాకోపంవస్తే మాచెడ్డచిక్కు, (ప్రేమతో) జానకీ! రా. (గునుస్తూ) అందుకనే మతి!
(ఓచిన్న డబ్బా వచ్చి లంబబోదరంమీదపడుతుంది) అమ్మోయ్యో! చచ్చాను! (అంటూ పరిగెత్తు గెళ్ళి సర్వానామం వెనక్కాల దాక్కుంటాడు.)

సర్వ: (కోపంగా; L. F దగ్గర కెళ్ళి, పైకిచూస్తూ) ఏమిటిది, అమ్మాయి? అల్లుణ్ణి అల్లాకొట్టచ్చా? తప్పు కదూ? ఎంతదెబ్బతగిలిందో చూడు. అతనికి!

లంబో: మతే! మెదడులో సంగీతం ఇప్పుడింకా తగ్గ లేదు!

సర్వ: రా. కిందికి! మహానుభావులైన స్వాములవారు స్వయంగా వచ్చారు!

సుంద: రోగి ఎక్కడుంది?

లంబో: అదుగోనండి! (R- F పైకిచూపిస్తూ) మేడమెట్ల మీదమరోడబ్బాపుచ్చుకుని హిట్లరానుంచుంటుది!

సుంద: (లేచి) సరే! మేమే స్వయంగా వెడతాం!

సర్వ: చిత్తం! దయచెయ్యండి! (అని R F లోకి చూపిస్తాడు)

లంబో: (సుందరం R F కేసి వెడుతూ-టే) జాగ్రత్త స్వామీ! గరిట్లు, డబ్బాలు, రోకళ్ళు అన్నీ ఉన్నాయి పైన! (సుందరం R F లోకి వెళ్ళిపోతాడు. అంతా అటువైపే ఆశ్చర్యంగా చూస్తాంటారు.) మామగారూ! మామగారూ!

సర్వ : (R F. కేసి చూస్తూ) ఏమిటోయి ?

లంబో : చూశారా! జానకి ఆస్వామివార్ని మేడమీదకి తీసుగుపోతుంది, ఏం చేస్తుందో, ఏమిటో! నలుగురు మొగాళ్ళనీ కేకేస్తే !

సర్వ : అంత మతిలేకుండా కంగారుపడతా వేమిటోయి, మరీనూ (అని కుర్చీ కేసి నడుస్తూ) అల్లా కుర్చీలో కూర్చో!

లంబో : (కూచుంటూ) నాకేం! సన్యాసులకి ఇన్సాన్లెన్ను కూడా ఉండదు!

సర్వ : ఫరవాలేదులే! లక్కయ్యా!

లక్క : బాబయ్యా !

సర్వ : ఈస్వామివారి ధర్మమా అని అమ్మాయి తిరిగి ఆరోగ్యవంతురాలైతే ఎంత ధన్యులం ?

లక్క : అడ్డమాండీ! ఓసారి మా ముసలమ్మ!

లంబో : ముసలమ్మకే గాని లక్కయ్యా! ఇందాకా నువ్వు తెచ్చిన పెట్టె ఎక్కడిది ?

సర్వ : పెట్టేమిటోయి ?

లక్క : మరే! పెట్టేమిటంటిరి !

లంబో : అయ్యో, నీమతిమండా! దెయ్యం మెత్తుగుపోయిన పెట్టెరా !

సర్వ : దెయ్యమేమిటోయి ?

లక్ష్మ : ఆ! నేనేదో పెట్టి తెచ్చినట్టు, అది ఏదో దెయ్యం ఎత్తుగుపోయినట్టూ అయ్యగారికి కనిపించిందట!

లంబో . కనిపించడమేమిట్రా, నీ మొహం! నువ్వు పెట్టి తేలా ?

లక్ష్మ ; (సర్వనామంతో) ఇంకేం సెప్పమంటారు, బాబయ్యా!

సర్వ ; లంబోదరం !

లంబో ; అదికాదండీ !

సర్వ ; ఏదీకాదు! నువ్వు కాస్సేపు ఏమీ ఆలోచించకుండా కూచో !

లంబో ; ఖర్మ !

సర్వ ; లక్ష్మయ్యా! ఫ్లాస్కులో కాఫీ ఉందా ?

లక్ష్మ : ఉందండి!

సర్వ ; అయితే ఓ కప్పుడు వేడివేడి కాఫీ పట్టుగొచ్చి లంబోదరాని కియ్యి !

లక్ష్మ ; సిత్తం! (అని M B లోకి వెడతాడు.)

లంబో ; అంతేగాని నామాట వినరు!

సర్వ ; ఎందుకు, లంబోదరం, అనవసరంగా అంత ఇది అయిపోతావు ? స్వాములవారు మన అదృష్టంకొద్దీ దొరికారు. అమ్మాయికి సుబ్బరంగా నయమయిపోతుంది. వెంటనే మీ ఇద్దరుకీ పెళ్ళి చేసేస్తాను, తీరిపోతుంది ! ఇంకేం కావాలి, చెప్పు !

లంబో ; (హుషారుగా) అంతే అనుకోండి! (లక్ష్మయ్య M B లోంచి ఓ కాఫీఉన్న కప్పు, దాంతో సాసరు తీసుకవచ్చి, లంబోదరానికి ఇస్తాడు. లంబో

దరం కొంచెం చప్పరించి) అయితే, మామగారూ! మొదణ్ణుంచీ మీ అమ్మాయి నోరూ, చెయ్యీ మహా వాడి అనుకుంటాను.

సర్వ : ఛ. ఛ. (లంబోదరం కంగారు పడతాడు.) నీకు ఖాయ పరిచాక ఇల్లా అయిపోయిందిగాని, ఇది వరకు నోరెత్తి మాట్లాడిగాని, కన్నెత్తి చూచి గాని ఎరగదు. పరాయి వాళ్ళు ఇంటికి వస్తే ఎదురుగా కనపడడానికే సిగ్గుపడిపోయేది పిచ్చితల్లి

లంబో: (ఆశ్చర్యంగా) అయితే మీఅమ్మాయికీ సిగ్గుందా!

సర్వ : రెండు నిమిషాలు సరిగ్గా మాట్లాడవుగదా! ఏమిటో తెలివితక్కువ వాగుడు

లంబో : బాగానేఉంది! ఆడాళ్ళకి కూడా సిగ్గుంటుందని నాకేం తెలియనూ!

సర్వ : ఖర్మ! అని లేచి విసుగ్గా పచార్లుచేస్తాడు. లంబో దరం కాఫీతాగి కప్పూ, సాసరూ లక్కయ్యకి అందిస్తాడు. లక్కయ్య M B దగ్గర ఉన్న చిన్న బల్లమీద పెడతాడు.) స్వాములవారు వెళ్ళాక ఎంత నిశ్శబ్దంగా ఉందీ!

లంబో ; ఇంక అంతా నిశ్శబ్దమేనండి!

సర్వ ; అదేమిటి?

లంబో ; (రాగధోరణిలో) పవమాన సుతులు బాసి—

సర్వ ; ఆ పాటేమిటి?

లంబో : మంగళమండి ! ఈ పా టి కి స్వాములారి ప్రాణం కాస్తా పాపం పికా రెళ్ళిపోయుంటుంది !

లక్ష్మ ; (R. F. కేసిచూస్తూ) అబ్బ, ఊరుకోండి ! సోము లారు వస్తున్నారు !

లంబో; ఏమిటి, బతికే !

సుంద ; ( R F లోంచి గంభీరంగా చూస్తూ వచ్చి మధ్య కుర్చీలో కుర్చుంటాడు. ముగ్గురూ ఆ దు ర్దా గా అతని చుట్టూ జే ర తా రు. సర్వనాశుం కేసి తిరిగి) నారాయణ !

సర్వ ; చి త్రం ! అమ్మాయికి ఎల్లా ఉందండి !

లంబో ; పాపం ! గరిట్లాండి, రోకళ్ళా !

లక్ష్మ ; అబ్బ, ఊరుకోండి !

సుంద ; వ్యాధి చాలా తీవ్రమయింది !

సర్వ : (బాధగా, భయంతో) స్వామీ !

సుంద ; ఔషధ ప్రయోగం జరిగింది గనుక రోగి ప్రాణానికి ప్రమాదం తప్పింది !

లక్ష్మ : అ యి తే ఇంకేమీ భయంలేదంటారా, స్వాము లారూ !

సుంద : ఔషధ ప్రయోగంజరిగుంటిగా? తెల్లవారేటప్పటికి ఏమీ ఉండదు. స ర్వ నా శ ం ఆనందంతో చూస్తాడు.

సర్వ : అంతా దయదయుండి. దిక్కుతోచక నిరాశలో మునిగిపోతున్న మమ్మల్ని రక్షించడానికి తమరు నిజంగా దేవుడులాదయచేసారు. ఎన్ని జన్మలకైనా మీాఋణం తీర్చుకోలేను !

సుంద : అంతా భగవత్సంకల్పం !

లంబో చిత్తం ! అసలు స్వామీ ! ఈ రోగం పైత్య ప్రకోపమా లేక దెయ్యం ప్రభావమా ?

సుంద పట్టుదలల పరిణామం !

లంబో : అంతేనంటారా !

సుంద . అంతేకాదు ! దుష్టగ్రహ సాంగత్యదోషం కూడా ఉంది !

సర్వ అంటే !

లంబో: నే చెప్పాలా ? పిశాచ పరిచయం !

సర్వ : నువ్వూరుకో. లంబోదరం !

సుంద . అతను చెప్పింది నిజమే (లంబోదరంతో) నీచెయ్యి చూపెట్టు !

లంబో : (హడలిపోయి చెయ్యి దాచుకుని) నాకేం జబ్బు లేదండి !

సర్వ : లంబోదరం ! చూపెట్టు చెయ్యి !

లంబో: చిత్తం ! (అని అనుమానంగా బాధగా అర చెయ్యి సుందరానికి చూపిస్తాడు.)

సుంద : (ఒకక్షణం చెయ్యి పరీక్షగా చూసి తలపరికిస్తూ) అదా సంగతి! సరే!

లంబో: (బిక్క మొహంతో) అంటే?

సుంద : నీకిదివరకే ఓ పెళ్ళయిందికదూ! (లంబోదరం (తెల్లబోయిచూస్తూ నిలబడిపోతాడు)

సర్వ : ఏమిటిది లంబోదరం?

సుంద : నీకిదివరకే ఓ పెళ్ళయిందికదూ?

లంబో: (మొండిగా) ఏమో, నాకు తెలియదు!

లక్క : అదేటండి, అల్లా సెపుతారూ?

సుంద : అబద్ధమాడి తప్పించుకోడానికి ప్రయత్నించకు! మునిసిపల్ ఆఫీసులో కావలిస్తే రికార్డు సాక్ష్యం కూడా ఉంది! సమాధానం సరిగ్గాచెప్పు

లంబో . (చిరికోపంతో) నా పెళ్ళి మునిసిపల్ ఆఫీసులో అవలేదు! గుళ్ళోఅయింది!

లక్క : (సుందరంతో ఆశ్చర్యంగా) తమరికెల్లా తెలిసిందండీ

సర్వ : మహానుభావులకి తెలియని విషయాలేముంటాయి? లంబోదరంతో) మరి ఆ ముక్క నువ్వు నాతో ఎందుకు చెప్పలేదూ?

లంబో; ఎల్లానూ అయిపోయిందికదండీ, అందుకని! పైగా పదేళ్ళక్రితమే అది పోయిగా చచ్చిపోయింది తుడాను!

సర్వ : ఎంతమోసం !

సుంద : ఇప్పుడు ఆ గ్రహంకూడా మీ అమ్మాయిని పీడి స్తోంది !

సర్వ : (భయంగా) ఆ !

సుంద : అవును ! ఈ సంబంధం నిశ్చయించాకే మీ అమ్మాయికి ఆవ్యాధి వచ్చింది. అవునా !

సర్వ : చిత్రం !

సుంద : ఔషధ ప్రయోగం ఈ పరిస్థితుల్లో తాతా. లిక శాంతినే కలగజేస్తుంది. ఈసంబంధం రద్దయితేగాని ఆగ్రహం వదలదు. ఆగ్రహం వదు త్రేనేగాని మీ అమ్మాయికి పూర్తిగా నయమవదు !

సర్వ : అల్లాగా !

లంబో : అయితే ఇందాకా నావీపుమీాద కొట్టింది. అదా ! స్వాములూ! నాకూడా కాస్త విభూతి ఇవ్వారూ ?

సర్వ : ఒద్దు స్వామీ ! ఈ లంబోదరం న బంధం ఇప్పుడే రద్దుచేసేస్తున్నాను.

లంబో : అదేమిటి, మామగారూ!

లక్ష్మి : చాల్లెండి. లంబోదరంగారూ! మా అమ్మాయిగారికి నయమవటం మాకు ముఖ్యం !

లంబో : రామ, రామ ! మామగారూ !

సర్వ : నువ్వింక ఆపేరెట్టి నన్ను పిలవకు !

లంబో: డొక్కా లంబోదరం, నిమ్మపళ్ళరోడ్డు! సెఖన్నీ ఎలా శాలిపోయిందిరా. చచ్చికూడా సాక్షస్తోంది సిపెల్సాం సాధించడమేమిటి చప్పగా చావంగడుతోంది కూడాను!

అక్క: ఒకవేళ పతివ్రత లేమోనండి!

లంబో: నీమొహం! నోర్మూయి!

లక్క: అదికాదండి, ఓసారి మాముసలమ్మ!

లంబో: దిక్కుమాలిన ముసలమ్మ, ఊరుకోరా!

సుంద: పెళ్ళిప్రయత్నం రద్దుచేశానుగనుక తప్పకుండా నయమయి తీరుతుంది. కాని మళ్ళీ ఈసంబంధం గురించి ఎప్పుడు ఆలోచించినాసరే, మీ అమ్మాయి పరిస్థితి మళ్ళీ మొదటికొస్తుంది. తిరగబెట్టినవ్యాధి తిరుగు మొహం పట్టడం చాలా కష్టం!

సర్వ: చిత్తం! ఈ సంబంధంగురించి ఇంక ఆలోచించనండి! దేవుడుమీద ఒట్టు!

లంబో; ఆ!

సుంద: అయితే ఇక మేం వెళ్ళొస్తాం! (అని లేస్తాడు.)

సర్వ: స్వామీ! ఒక్కక్షణం!

సుంద: ఎందుకూ!

సర్వ: ఏదో మాఉడతాభక్తికి కాస్త నిదర్శనం!

సుంద: ఏమీ అక్కర్లేదు?

సర్వ : మీకోసంకాదు స్వామీ! మా తృప్తికోసం!
　　ఇప్పుడే వస్తాను!
　　(అని M B లోకి లోపరగా వెడతాడు.)

లంబో: (మెల్లిగా సుందరం దగ్గరికివచ్చి) స్వామీ!

సుంద : ఊ!

లంబో: నాదీపం ఆర్పేశారు! ఘోరీ కాస్త సాయమైనా చేసి
　　పెట్టండి! జన్మంతా మీపేరు చెప్పకుంటాను!

సుంద : ఏమిటది?

లంబో: దెయ్యాలకి కూడా చేతబడి చెయ్యడం తమకి తెలి
　　సుంటుంది. ఆయన నాభార్యకి కాస్త చేతబడిచేసి
　　కదలకుండా కట్టెయ్యండి, మీకాళ్ళట్టుకుంటాను!

లక్ష్మ : అంతా అయిపోయాక ఇప్పుడెందుకండీ?

లంబో: ఆ! ఆ మణుగున్నర సన్మానం నీకూడా జరగ
　　వలసింది. అప్పుడు తెలిసేది ఎందుకోను స్వామీ!
　　విభూతి!

సర్వ : (లక్ష్మయ్య తెచ్చిన పెట్టి చేత్తో పట్టుకుని M B
　　లోంచి ఆశ్చర్యంగా వస్తూ) లక్ష్మయ్యా! ఈ పెట్టి
　　ఎవరిదిరా!

(సుందరం, లక్ష్మయ్య తెల్లబోయి చూస్తారు.)

లంబో: (భయంగా చూస్తూ) అదేనండి అదే!

సర్వ : ఏమిటా అది!

లంబో: అదేనండీ దెయ్యమెత్తుకుపోయిన పెట్టె! ఇదెక్కడ కనపడింది మీాకు ?

సర్వ : గదిలో నా మంచంక్రింద ఉంది !

లంబో: అయితే గదిలో మీామంచంమీాదే దెయ్యం ఉంది !

సర్వ : దెయ్యంలేదు, దేవతాలేదు ! అసలీపెట్టె ఎవరిది !

సుంద : (నీరసంగా నకిలించి) కాలాతీతమవుతుంది ! పోం వెడతాం !

సర్వ : క్షమించండి స్వామీా ! ఒక్క నిమిషం ! (లంబో దరంతో) చెప్పు లంబోదరం! ఈపెట్టె ఎక్కడిది

లంబో : నన్ను పట్టుకున్నా రేమిటండీ ! తెచ్చిన వాడు లక్కయ్య !

సర్వ : ఏరా లక్కయ్యా ! ఇందాక తెలీయదన్నావే !

లక్క : (నీరసంగా నవ్వి) ఓసారి మా ముసలమ్మ !

సర్వ : నీముసలమ్మ మండిరి! అసలీపెట్టె నీకెక్కడిదిరా ?

లక్క : శాస్త్ర పెట్టెకోసం అంతకంగారు పడతారేమిటండీ!

సర్వ : ఇది శాస్త్ర పెట్టెకాదురా ! సుందరం పెట్టె !

లక్క : (ఆశ్చర్యంగా నటిస్తూ) ఏమిటీ సుందరంగారి పెట్టా !

లంబో : మీాకా దెయ్యం పేరుకూడా తెలుసేమిటి మామా గారూ !

సర్వ : నువ్వూరుకో లంబోదరం ! ఏరా, లక్కయ్యా ! నువ్వూ ఆ నీచుడు సుందరంతోకలసి యజమానికి

ద్రోహ· తలపెడుతున్నా వన్నమాట! స్వామీ!
ముందు వీణ్ణి చింతచెట్టు అయిపోయేలా శపించండి!

సుంద: ఆవేశపడకు! అసలీ సుందరం ఎవరు!

ప్రవా: (L F లోంచి ఆదుర్దాగావచ్చి) మా అబ్బాయి!

సుంద (తెల్లబోయిచూసి) ఆ! నా! (కళ్ళుమూసుకుని, కుర్చీలో కూచుంటూ) నా రా య ణ! అని జపం నటిస్తాడు)

లంబో: ఏమిటీ మీ రనేది!

ప్రవా: సుందరం మాఅబ్బాయి అంటున్నాను!

లంబో: ఏమిటీ? ఆ దెయ్యం పాపం మీఅబ్బాయా!

ప్రవా: దెయ్యమా!

సర్వ: (మధ్యనున్న లక్కయ్యతో) ఒసేయి, లక్కయా! అసలీప్రవాహంపంతులు సిగ్గులేకుండాఇక్కడికెందు కొచ్చాడో కనుక్కో!

ప్రవా: ల క్క య్యా! ముందు మా అబ్బాయిని దెయ్య మంటున్న ఈపిశాచమెవడో కనుక్కో!

లంబో: పిశాచమేమిటీ! డాక్టర్లంబోదరం, నిమ్మళ్ళ గోడ్డు!

సర్వ: ఒసేయి, లక్కయ్యా! ప్రవాహం పంతులుకేసి చూపిస్తూ) ఆయన్ని తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్ళి పొమ్మన్నానని చెప్పు!

ప్రవా: (తనదగ్గరికి గబుకుగా వచ్చిన లక్కయ్యతో) నే వెళ్ళనన్నానని చెప్పరా, లక్కయ్యా!

సర్వా: (ఠక్కుబోయి తన దగ్గరికి వచ్చిన లక్కయ్యతో) అసలెందుకొచ్చాడో కనుక్కో!

ప్రవా: మా అబ్బాయి సుందరాన్ని అప్పచెప్పమని అడగటానికి!

సర్వా: మీ అబ్బాయా?

ప్రవా: అవును!

సర్వా: నాకేం తెలుసు?

ప్రవా: నీకేం తెలుసు!

సర్వా: కలవరిస్తున్నావా? నాకింత మనోక్షోభ కలిగించిన వాణ్ణి నాగుమ్మంలో అడుగుపెట్టనిస్తానా! కనిపిస్తే తుపాకినే యిద్దును!

ప్రవా: నీడబాయింపులు నాదగ్గరకాదు సర్వానామం! అది మా సుందరం పెట్టికదూ!

సర్వా: అదా! అవును?

ప్రవా: ఇక్కడికెల్లావచ్చింది?

సర్వా: ఏమో!

ప్రవా: ఎల్లా వచ్చిందో నాకు తెలుసు! నీ కూతు ప్రేమలో మతి చెడి తిరుగుచున్న మావాణ్ణి మః

పెట్టి మీా ఇంటికి తీసిగొచ్చావు. మంచి మాటలతో మందో, మాకో పెట్టి మావాణ్ణి మాయంచేశావు ! అందుకు సాక్ష్యం ఈపెట్టె ! దానికి ఋజువు ఈ మనిషి !

లంబో: (తెల్లబోయి) నేనా !

ప్రవా: అవును ! నువ్వే ! అన్నావుగా మావాడు దెయ్యమయ్యాడని !

లంబో: ఏమో నాకేం తెలుసు?—మామగారే చెప్పారు !

సర్వ: (తెల్లబోయి) నేనా !

లంబో: అవును! ఇందాకా అన్నారు కదండీ !

సర్వ: నీ మొహం ! దీని కంతకీ అ స లు కా ర ణం ఈ లక్కయ్యే !

లక్క: (భయంగా) నేనాండీ ?

ప్రవా: ఏమైతేం, ఈదారుణానికి మీా ముగ్గురే కారణం. నేనిప్పుడే వెళ్ళి పోలీసుల్ని తీసుగొస్తానుండండి !

లంబో: అయ్యబాబోయి, పోలీసులే !

సర్వ: దిక్కుమాలిన ఖర్మ ! ప్రవాహం పంతులూ ! ఒక్కసారి ఆగు ! (సుందరంతో) స్వామీ !— అనవసరంగా అపవాదుల పాలవుతున్నాను! ఆయన కొడుకు ఎక్కడున్నాడో దయచేసి చెప్పండి !

ప్రవా: వారెవరు!

లక్ష్మి: వారు!— బాబయ్యా! గొప్పశక్తిగల సోమలా రండి!

ప్రవా: అల్లానా?— స్వామీ— మా అబ్బాయిని ఈ దుర్మార్గులు ఏంచేశారో చెప్పండి! (బోతరం భయంగా, రహస్యంగా L. F కి చెక్కా పోతాడు,)

సుంద: అయితే సర్వానామం!— నీకు ఈ చిక్కులోంచి తప్పించుకోవాలనుందా!

సర్వ; చిత్తం! — మనస్ఫూర్తిగా ప్రార్థిస్తున్నానండి!

సుంద; (ప్రవాహంపంతులుతో) మీకొడుకు మీకుదక్కాలనుందా!

ప్రవా; వాడు నాప్రాణమండి!

సుంద; అయితే మీ మనసుల్లో రేగిన ద్వేషాలు తుడిచేసుగుని మళ్ళీ మామూలుగా స్నేహితులవండి!—

సర్వ: అనంభవం స్వామీ!

ప్రవా; వీల్లేదు. స్వామీ!

సుంద; అయితే నీకు జైలు తప్పదు! — నీకు పుత్రశోకం తప్పదు!

సర్వ ;— ప్రవా;— స్వామీ!

లక్ష్మ : సోమలారి మాటకి తిరుగుండదండి !

[సర్వానామం. ప్రవాహం పంతులూ ఒక్క క్షణం తటపటాయించి లక్ష్మయ్యకేసి తిరుగుతారు]

ఓసారి మా ముసలమ్మ !

సర్వ : ఒరేయి, నువ్వొందు !

ప్రవా : సర్వానామం ! నన్ను క్షమించు ! (అంటూ ముందుకి వస్తాడు)

సర్వ : (ఆనందంతో) ప్రవాహం పంతులూ ! (అంటూ ఎదురు వెళ్ళి కౌగలించుకుంటాడు) స్వామీ ! మా అల్లుడు సుందరం ఎక్కడున్నాడు ?

సుంద : ఇక మీ ఇద్దరూ వియ్యమందడం ఖాయమేనా !

ప్రవా . ఖాయమేనండి !

సుంద : సత్యమేనా

సర్వ : సత్యమేనండి ! దేముడుమీద ఒట్టు !

సుంద : అయితే ముందు మీ ఇద్దరూ అల్లా వీధులోకి షికా రెళ్ళిరండి !

ప్రవా ఎందుకు స్వామీ !

సుంద : అనవసర ప్రసంగం !

సర్వ : చిత్తం ! ప్రవాహం పంతులూ ! స్వామివారిమాటకి తిరుగులేదు నడు !

(ఇద్దరూ L. F లోకి వెడతారు.)